

"స్వీయ-చిత్రం" ఎస్. టి. కొనెన్కోవ్.

## ఈ సంచికలో



ఎస్. టి. కొనెన్కోవ్, సోవియట్ శిల్పి, 1874 లో, స్మొలెన్స్కీ మండలంలో ఒక రైతు కుటుంబంలో జన్మించారు. 1892 నుండీ మాస్కోలోని చిత్రలేఖన, శిల్ప, వాస్తు పాఠశాలలో ఎస్. ఐ. ఐవనోవ్, ఎస్. ఎం. వోల్నుహిన్ దగ్గర కళా అధ్యయనం చేశారు. 1902లో పీటర్స్‌బర్గ్ కళాపరిషత్తులో పట్టభద్రులై, 1916లో పరిషత్సభ్యులైనారు.

అక్టోబర్ సోషలిస్టు మహా విప్లవానంతరం, స్మరణీయమైన లెనిన్ ప్రచార పథకాన్ని ఆచరణలో పెట్టడానికి కృషిచేసిన శిల్పులలో ఆయన ఒకరు.

1924లో అమెరికన్ సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళి, 1945 వరకూ అక్కడే నివాసంచేసి, ఆ తరువాత సోవియట్ దేశానికి తిరిగివచ్చారు.

ఎస్.టి కొనెన్కోవ్‌కు, ఆయన సృజనాత్మక సామర్థ్యాన్ని గుర్తించి రష్యన్ సమాఖ్య ప్రజా కళాకారుడన్న బిరుదం, 1951లో స్టాలిన్ బహుమతి యివ్వబడ్డాయి. "స్వీయ-చిత్రం" అన్న విశిష్ట కళాఖండానికి లెనిన్ బహుమతి పొందారు.

విస్తృత సృజనాత్మక కృషిలో, ఇతర ప్రజా కార్యక్రమాలలో ఇప్పుడాయన నిమగ్నులై ఉన్నారు.

సంపుటి 8
సంచిక 13

# సోవియట్ భూమి

జూలై 10, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖవారు ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



# ప్రజల భవిష్యత్తు — ప్రజల హస్తగతం

## సోవియట్ ప్రజాస్వామ్యం గురించి వివరణ

**జి. షహ్నజరోవ్**

> *ఢిల్లీలోని మా పాఠకుడు శ్రీ అస్గర్ అలీ సోవియట్ ప్రజా స్వామ్యం గురించి ఒక వ్యాసాన్ని ప్రచురించమని మమ్ములను కోరారు. ఆయన కోరిక ననుసరించి మేమీ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము.*

బహుశా సోవియట్ సమాజంలోని అత్యంత విశిష్టలక్షణం, ప్రజా జీవితంలో పాల్గొనని వ్యక్తి దానిలో గోచరించకపోవడం. గ్రామీణ సోవియట్లు మొదలుకొని సోవియట్ దేశ సుప్రీం సోవియట్ వరకూ ప్రభుత్వాధికార శాఖలకు, పదిహేనులక్షలకు పైగా సోవియట్ పౌరులు సభ్యులుగా వున్నారు. లక్షోప లక్షల మంది శ్రామిక ప్రజలు స్థానిక సోవియట్ల స్థాయీ సంఘాల కృషిలోనూ, గృహ నిర్వాహక కార్యాలయాల సహాయ సంఘాల కృషిలోనూ, పాఠశాలలకు సంబంధించిన తలిదండ్రుల సంఘాల, బాలసంస్థల కృషిలోనూ, వ్యాపార సంస్థల పనిపైని ప్రజా అజమాయిషీ సంఘాల కృషిలోనూ పాల్గొంటుంటారు.

కాని దీనితో అయిపోలేదు. చైతన్యవంతుడైన ప్రతి సోవియట్ పౌరుడూ, ఈ సంఘాలు దేనిలోనూ సభ్యుడుగా వుండకపోయినప్పటికీ, అక్రమాన్ని దేనినీ తనకెందుకులే అని చూసిపూరుకోడు. "అందులో తాను చొరబడి ఎందుకు అవస్థపడాలి. దానితో సంబంధంగలవారి పని అది" అని అంటే అనవచ్చు. బాధ్యత ఎరగని వారెవరేనా. కాని సోవియట్ ప్రజలలో చాలా ఎక్కువ భాగం యింకో విధంగా భావిస్తారు. వారు ప్రతి ప్రజాహిత విషయాన్నీ తమ స్వంత వ్యవహారంగా పరిగణిస్తారు. ఇందుకు కారణాన్ని తేలికగానే అర్థం చేసుకోవచ్చును. ఉత్పత్తి సాధనాలన్నీ, ప్రజా సంపద అంతా ప్రజలకు చెందివున్న ఒక సమాజంలో, పౌరులు తాము దేశాధినేతలమని భావిస్తారు.

రాజ్య విషయాలను నిర్ణయింతటంలో పాల్గొనడానికీ, పౌరులందరికీ సామ్యవాద ప్రజాస్వామ్యం విస్తృతమైన అవకాశాలను యిస్తుంది. అధికారులు ఎన్నుకోబడడం, తొలగింపబడి వారి స్థానే యింకొకరు ఎన్నుకోబడడమూ, వారు ఓటర్లకు సంజాయిషీ చెప్పుకోవడమూ అన్న సూత్రం ఎప్పుడూ అమలు కావడంలో, యిది ముఖ్యంగా వ్యక్తం అవుతోంది. సభ్యులు ఎన్నుకోబడడం మాత్రమే కాదు, సోవియట్ రాజ్యాధికారులందరూ తమ పదవులకు ఎన్నుకో బడతారు, లేదా ఏదో ఒక ప్రాతినిధ్య అధికార శాఖకు తమ కార్యకలాపాల విషయంలో సంజాయిషీ చెప్పుకోవలసి వుంటుంది.

కాని సభ్యులు ఓటర్లతో సంబంధం లేకుండా పోయే ప్రమాదం లేదా ? దీనిని నిరోధించేందుకు సామ్యవాద ప్రజాస్వామ్యంలో అనేకం గట్టి చర్యలున్నాయి. ఈ విషయంలో చాలా ముఖ్యమైన హామీ, ఎన్నుకోబడిన సభ్యులు దురధికార ఉద్యోగులుగా మారిపోకుండా, ప్రతి ఒక్కరూ తన పదవిలో పనిచేసుకుంటూ వుండడం. సుప్రీం సోవియట్‌తోబాటుగా సోవియట్ల సమావేశానికి సభ్యులు తమ తమ పనుల స్థలాలనుండి వస్తారు—కార్మికుడు తన పరిశ్రమనుండి, సమిష్టి రైతు తన క్షేత్రంనుండి, విజ్ఞాన శాస్త్రవేత్త తన పరిశోధనాలయం నుండి వస్తారు, సమావేశ మయిపోయాక, వారు తమ పనులకు వెళ్ళిపోతారు. ఈ విధంగా సభ్యులు ఎప్పుడూ తమ కార్య కలాపాల

గురించి సర్వదా అభిప్రాయాన్ని ప్రకటించగల ప్రజలమధ్య వుంటారు.

ఇంతే కాకుండా, అధికార శాఖలలో తమ పనిని గురించి ఓటర్లకు క్రమ పద్ధతిలో నివేదించవలసి వుంటుంది, సభ్యులు కార్య విధానం ప్రకారం. కాని యిది చాలదు. ఇవన్నీ యిలా వున్నప్పటికీ ఎవ్వరో ఒక సభ్యుడు తన విధులను సరిగా నిర్వర్తించక, ప్రజా ప్రతినిధి అన్న తన ఉన్నత బిరుదుకు ఉచితంగా నడుచుకోలేదనుకోండి. ఈ సందర్భంలో ఓటర్ల కోరిక ప్రకారం అతను తన పదవినుండి తొలగింప బడతాడు.

కాని యిటువంటి అవసరం కలిగిన సందర్భాలు చాలా అరుదు. సోవియట్లకు సభ్యులలో అత్యధికభాగం, సోవియట్ ప్రజల ఉత్తమోత్తమ ప్రతినిధులు, తమ కృషి రంగంలో సమర్థత, ఉన్నత నైతిక గుణాలు గలవారు.

దేశపు అత్యున్నత శాసన నిర్మాణాధికార శాఖ అయిన సోవియట్ దేశ సుప్రీం సోవియట్ నిర్మాణం, సోవియట్ ప్రజాస్వామ్య విశిష్టతను తెలుపుతుంది. దాని రెండు సభలలో ఒకటైన జాతుల సోవియట్‌లో 130 మంది కార్మికులూ, 106 మంది రైతులూ, 116 మంది విజ్ఞాన శాస్త్రజ్ఞులూ, సాహిత్యపరులూ, కళాకారులూ వున్నారు. యూనియన్ సోవియట్‌లో 118 మంది కార్మికులూ, 114 మంది రైతులూ వున్నారు. సుప్రీం సోవియట్ సభ్యులలో అన్ని జాతుల ప్రతినిధులూ, 348 మంది మహిళలూ వున్నారు.

ఒక నూతన సాంఘిక వ్యవస్థ అయిన సోషలిజం, అభివృద్ధి చెందిన ప్రజాస్వామ్య రూపాలను ఉదయింపజేస్తోంది. శాసనాల ముసాయిదాలు యావద్దేశంలోనూ చర్చింపబడడం, ఇటువంటి రూపాలలో ఒకటి. సరిగ్గా యీ పద్ధతిలోనే సోవియట్ దేశ రాజ్యాంగం ఆమోదింపబడింది, ఇటీవల సంవత్సరాలలో యీ పద్ధతి అనేక సందర్భాలలో ఉపయోగింపబడింది. దేశ వ్యాప్తంగా చర్చింపబడిన తరవాత ప్రభుత్వ ఉపకారవేతనాల గురించి ముసాయిదా శాసనాన్ని, సోవియట్ ప్రజలు సూచించిన అనేక సవరణలను పరిశీలించాక సుప్రీం సోవియట్ ఆమోదించింది. జాతీయార్థిక వ్యవస్థ నిర్వహణ పునర్నిర్మాణం గురించి సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి యన్. యస్. కృశ్చెవ్ నివేదికలోని సిద్ధాంతాలపై దేశ వ్యాప్త చర్చ, పెద్ద యెత్తున జరుపబడింది.

ఒక శతాబ్దం క్రితం మొదట ఉపయోగింపబడిన జనవాక్య నిర్ధారణయే యేమో, ముసాయిదా శాసనాలపై చర్చ? ఇటువంటి అభిప్రాయం తప్పుడు అభిప్రాయం అవుతుంది. జనవాక్య నిర్ధారణ దేశ వ్యాప్తమైన ఓటింగు, దీనిలో ప్రతి పౌరుడూ "అవును" లేదా "కాదు" అని జబాబు యివ్వవలసి వుంటుంది.

ముసాయిదా శాసనాల చర్చ యిందుకు పూర్తిగా భిన్నమైనది. ఈ చర్చలో ప్రజలు పైనుండి వచ్చే సూచనను ఆమోదించడంగాని నిరాకరించడంగాని మాత్రమే చేయరు, శాసన నిర్మాణంలో చురుకుగా పాల్గొంటారు కూడా. ఇటువంటి చర్చ ప్రాముఖ్యం—యిది అన్ని విధాలా ప్రజల రాజకీయ కార్యకలాపాలను హెచ్చించడంలోనూ, ప్రతి పౌరుడూ యావత్తు దేశదృష్ట్యా ఆలోచించి, యీ దృక్పథంతో సమిష్టి ఆశయానికి తనసేవను విలువకట్టడంలోనూ వుంటుంది కూడా. శాసనాలను దేశ వ్యాప్తంగా చర్చించడం పరిస్థితులకు పరిష్కరించే ఒక మార్గమని చెప్పవచ్చును. సామ్యవాద ప్రజాస్వామ్య కర్తవ్యం సమాజంలోని సభ్యులంతా ఎక్కువ ముఖ్యమైన రాజ్య వ్యవహారాలను పరిష్కరించడంలో సహాయపడడమని లెనిన్ ఉద్ఘాటించినప్పుడు దీనినిగురించే ప్రసంగించారు.

ఇక ప్రజాస్వామ్యం యొక్క యితర సమస్యలను—మానవుల హక్కులు, రాజకీయ స్వేచ్ఛలు—చూదాం. ఉత్పత్తి సాధనాలకు ప్రజా యాజమాన్యం, వినాశనాత్మక ఆర్థిక సంక్షోభాల నెరుగని ప్రణాళికాబద్ధమైన ఆర్థికాభివృద్ధి ప్రతి సోవియట్ పౌరునికి అకని అతి ముఖ్యమైన హక్కుకు, పని హక్కుకు హామీ నిస్తాయి. పాతికేళ్ళకు పైనే నిరుద్యోగాన్ని తొలగించిన సోవియట్ దేశానికి, యీ సమస్య విషయమై యింకా చేయవలసిందేమీ లేదు.

ప్రతి శ్రామికునికీ తన శ్రమకు దాని రాశినిబట్టి, నాణ్యాన్నిబట్టీ చెల్లింపబడుతుందని తెలియడంవల్ల, సామ్యవాద పరిస్థితులలో పని హక్కుకు ప్రత్యేకమైన సార్థకత కలుగుతుంది. తను ఎక్కువగా శ్రమించినట్టయితే, ఎక్కువగా ప్రతిఫలం కలుగుతుంది. ప్రతిఫలం జీతం రూపంలో మాత్రమేకాదు, తాను విశ్రాంతిని పొందగల క్లబ్బులు, భవనాలు రూపంలోనూ, తాను చికిత్సలను పొందగల ఆరోగ్యమందిరాలూ, ఆరోగ్యస్థావరాలూ రూపంలోనూ, తాను అధ్యయనం చేయగల విద్యాలయాలూ, సాంకేతిక పాఠశాలలూ రూపంలోనూ, తాను ఆరోగ్యాన్ని దిట్టపర్చుకోగల క్రీడాస్థలాలూ, తటాకాలూ రూపంలోనూ కూడా ప్రతిఫలం లభిస్తుంది.

సోవియట్ దేశ రాజ్యాంగం పౌరులకు విశ్రాంతి విరామాలకు హక్కుకూ, విద్యాహక్కుకు, వృద్ధాప్యంలోనూ, అనారోగ్యం లేదా అశక్తత కలిగినప్పుడూ పోషణకు హక్కుకూ హామీనిస్తుంది. అదే సమయాన సామ్యవాద ప్రజాస్వామ్యం, యీ హక్కులను ఉపయోగించుకోవడానికి భౌతిక ప్రాతిపదిక సృష్టికికూడా అవకాశాన్ని కల్పిస్తుంది. ఉదాహరణకు విద్యాహక్కు, తమ పిల్లలకు ప్రజలు చదువు చెప్పించడానికి భౌతిక అవకాశం లేకపోయినట్టయితే వృధాఅవుతుంది.

అందువల్లనే పాఠశాలలలోనూ, ప్రత్యేక సెకండరీ పాఠశాలలలోనూ, విద్యాసంస్థలలోనూ ఉచిత విద్య సోవియట్ దేశంలో ప్రవేశపెట్టబడింది. తమ విద్యాకాలంలో విద్యార్థులలో ఎక్కువమందికి, విద్యార్థి వేతనాల రూపంలో ప్రభుత్వంనుండి సహాయం లభిస్తుంది.

రాజకీయ స్వేచ్ఛల విషయంలోనూ యింతే. శ్రామిక ప్రజలకు వాక్స్వాతంత్ర్యానికీ, పత్రికా స్వాతంత్ర్యానికీ, సమావేశ స్వాతం

(మిగత 16వ పుటలో)






వీరమాత మాత్రియోనా ఫెదోస్కినా, ఆమె భర్త మాక్సిం ఫెదోస్కిన్, వారి పిల్లలు

# పెద్ద కుటుంబం

> ఎ. పెత్రోవా <

మాస్కోలోని నొవొపెస్చనయా వీధిలో కొత్తయిళ్ళ నిర్మాణం పూర్తిగా అవుతూ వున్నప్పుడు, ఆరేళ్ళ క్రితం నేను ఫెదోస్కినా కుటుంబాన్ని కలుసుకున్నాను. డజన్ల కొద్దీ వేన్లు, కొత్తయిళ్ళకు సామాన్లను తీసుకవస్తూ వుండడం కనిపిస్తుంది. నాకు కూడా వీటిలో ఒకయిల్లు దొరికింది. రెండురోజుల తరవాత మా పొరుగువారు ఇంట్లో ప్రవేశించడం చూశాను.

"బహుశా అనేక కుటుంబాలు అందు వుండవచ్చు"నని నేననుకున్నాను, పెద్దవాళ్ళూ, పిల్లలూ పక్కలూ, ఆసనాలూ, అల్మారాలు, టేబుళ్ళు, కుర్చీలూ, పెద్ద మూటలూ—వీటిలో పక్క చుట్టలున్నాయనుకున్నాను—పళ్లాలూ, పూలగోలాలూ, ఇతరమైన యింటి వస్తువులూ తీసుకవస్తూ వుండడం కిటికీలోనుంచి చూస్తూ.

వల్లని జుట్టుగల సన్నని స్త్రీ అక్కడనున్న వారందరికీ పనులప్పగిస్తోంది.

---

మాత్రియోనా ఫెదోస్కినా, సెలవుకు ఇంటికి వచ్చిన కుమారులు అలెక్సీ, (కుడినుండి రెండవ వ్యక్తి) నికొలాయ్‌లను కలుసుకొంటున్నది. వారు సైనిక పాఠశాల విద్యార్థులు






దూరంనుండి ఆమె చాలా చిన్నదానిలాగ కనిపిస్తోంది.

"వాన్యా! వాస్యా!" అంటూ ఆమె అరిచింది. "అక్కడే వుండి పోయారేమిటి?"

"నిమిషంలో కిందికి వచ్చేస్తామమ్మా" అని కిటికీలో నుండి ఒక గొంతుక అరిచింది.

ఇద్దరు పొడవాటి కుర్రవాళ్ళు గుమ్మంలోనుండి పరుగెత్తుతూ ఒక డెస్కును తీశారు. వారిలో ఒకడు "అమ్మా దీన్ని యెక్కడ పెట్టమంటావు?" అని అడిగాడు.

"అమ్మా?" అనుకుని ఆశ్చర్యపడ్డాను. మా కొత్త పొరుగావిడ యీ పొడవాటి కుర్రవాళ్ళ తల్లి అని నమ్మడం కష్టం.

నేనింకా యీ చిక్కును విప్పడానికి ప్రయత్నిస్తూనే వున్నాను. యింతలో యింటి అధికారిలోనికి తొంగిచూశాడు. కొత్త యిళ్ళ వాళ్ళకు ఆయన సాయపడుతూ వుండడం నేను చూశాను.

"మీకు మంచి యిరుగుపొరుగుల వాళ్ళున్నారు!" అని అన్నాడాయన.

"పన్నెండు మంది పిల్లలతో అద్భుతమైన కుటుంబం!"

తొందర్లోనే మాకు పరిచయమైంది. నేను కిటికీలోనుండి చూసిన నల్లజుట్టు ఆవిడ, ఆ పెద్ద కుటుంబపు తల్లి!

ఆమె సంతోషంగానూ, సరదాగానూ కనిపించింది. ఆమె పేరు మాత్రియేనా. ఆ కుటుంబపు యజమాని మాక్సిం నెమ్మదైన మనిషి, దయగలవాడు, పిల్లలుకూడా నాకు నచ్చారు. వారు చక్కగా, హుషా





ఫెదొస్కిన్ కుమారులలో ఒకడు ఇవాన్ చిత్రరచన చేస్తూన్న దృశ్యం. మాస్కో ఉన్నత అనువర్తిత కళా పాఠశాలలో (ఇదివరకటి స్త్రొగనోవ్ పాఠశాల) విజయప్రదంగా పట్టభద్రుడైనాడు (కుడిన పైచిత్రం).

వాసిలీ, ఫెదొస్కిన్ కుమారులలో ఒకడు (ఎడమ) మాస్కో. ముద్రణా విద్యాశాలలో పట్టభద్రుడు. భూగోళ శాస్త్ర సారస్వత ప్రచురణాలయంలో సాంకేతిక సంపాదకునిగా పనిచేస్తున్నాడు (కుడిన, రెండో చిత్రం).

మాక్సిమ్ ఫెదొస్కిన్ కుటుంబపు పెద్ద. పిల్లలకు దేవతా కథలను చదివి వినిపిస్తున్నారు. పెత్యా నాల్గవ - తరగతి విద్యార్థి. వాల్యా రెండవ-తరగతి విద్యార్థి. ఒలెగ్, ఇగోర్ బాలోద్యాన వనానికి వెళ్తున్నారు (దిగువ)









రుగా వుంటారు. వాళ్ళు తెలివైనవాళ్ళు, చురుకైనవాళ్ళు.

మేము యిరుగుపొరుగుల్లో వున్న ఆరేళ్ళలోనూ మాకు బాగా స్నేహం అయ్యింది. క్రమక్రమంగా నాకు యీ పెద్ద కుటుంబపు చరిత్ర తెలిసింది.

మాక్సిం పెదొస్కిన్ ఒక పేదరైతు కొడుకు. ఆయన ఉదార పోషణార్థం చిన్న తనంలోనే స్వగ్రామాన్ని వదిలి వెళ్ళాడు. చాలా కాలం ఆయన "యితరుల కోసం" పని చేశారు. చివరికి యిరవై ఏళ్ళ ప్రాయంలో ఇళ్ళలో నేలకు మెరుగుపెట్టే బృందంలో ఆయనకు పని దొరికింది, ఆయన ఆ పనిని నేర్చుకున్నారు. ఇంకొన్ని ఏళ్ళు జరిగిపోయాయి, మాక్సిం కుటుంబాన్ని ఏర్పర్చుకునే సమయం వచ్చిందను కున్నారు. నగరంలోని పిల్లలు ఆయనకు యిష్టంలేదు. అందువల్ల వధువుకోసం తన గ్రామానికి వెళ్లారు. అక్కడ తనకు భార్య కానున్న అమ్మాయిని చూసి, పెళ్ళయ్యాక ఆమెను నగరానికి తీసుక వెళ్లారు. మొదట వాళ్ళు చిన్నగదిలో వున్నారు, నిశ్శబ్దంగా వుండే ఒక ప్రక్క వీధిలో.

వారు సుఖంగా కాపురం చేస్తున్నారు. మాక్సిం యింతకుముందరలాగానే నేలకు మెరుగులు పెడుతున్నారు. మాత్రియోనాకు ఇంట్లో ఎప్పుడూ చేతినిండా పనివుంటుంది.

"మీరు యవ్వనంలో వున్నట్టుగా కనిపించడానికి కారణం ఏమిటి ?" అని ఒకరోజున మాత్రియోనాను నేను అడిగాను. "మీకు పన్నెండుగురు పిల్లలున్నారు. కాని మీకు 62 ఏళ్ళ వయస్సంటే ఎవ్వరూ నమ్మరు"

"పిల్లలవల్ల యెవ్వరూ ముసలివాళ్ళయిపోరు" అని ఆమె జవాబు చెప్పింది.

"వాళ్ళపట్ల బాధ్యతో ?"

"ఆ బాధ్యతవల్లకూడా ఎవ్వరూ ముసలివాళ్ళయిపోరు, లేమి, ముసలితనాన్ని తెస్తుంది. పిల్లలకు చాలినంత తిండి లేకపోయినా, వాళ్ళకు బట్టలు లేకపోయినా, భవిష్యత్తు భయంకరంగా కనిపించినా,

మాత్రియోనా ఫెదొస్కినా పిల్లలందర్లోకి చిన్నవాళ్లు, కవలలు ఒలెగ్, ఇగోర్‌ల పట్ల ఎక్కువ శ్రద్ధ వహిస్తుంది. (పైన).

వాల్యా రెండవ-తరగతి విద్యార్థి, టాన్యా ఏడవ-తరగతి విద్యార్థిని, పెత్యా నాల్గవ-తరగతి విద్యార్థి, పాఠశాలకు పోవడానికి సంసిద్ధమవుతూన్న దృశ్యం.



మాత్రియోనా ఫెదొస్కినా, ఆమె కుమార్తె మారియా మధ్యాహ్న భోజనాలకు వంటచేస్తూ (కుడి).

తల్లి 30 ఏళ్ళ వయసులో వృద్ధురాలిలాగా కనిపిస్తుంది. "మేము ధనికులం కాదు. కాని మేము ఎప్పుడూ లేమిని అనుభవించలేదు."

మాత్రియోనా మాటలను నమ్మకుండా వుండడానికి నాకు కారణమేమీ కనిపించలేదు. ఆ కుటుంబం సుఖంగా వుండదని కనిపిస్తూనే వుంది. పిల్లలు సంతోషంగా, ఆరోగ్యంగా వున్నారు, చక్కగా దుస్తులు వేసుకున్నారు. సెలవు రోజుల్లో వారు చక్కని సూట్లు వేసుకుంటారు. ఆ పెద్ద యింట్లో బాగా వస్తువులున్నాయి, భోగలాలసత్వం కనిపించకపోయినప్పటికీ. టెలివిజన్ సెట్టునూ, చెక్కడపు పని చేసిన సైడ్‌బోర్డునూ, అందమైన అద్దాలను కొనుక్కోగలిగినట్టయితే, స్వంత గ్రంధాలయం పెట్టుకుని, కొడుకుకు పుట్టినరోజు కానుకగా అకార్డియన్‌ను కొనగలిగినట్టయితే, అది డబ్బుగల కుటుంబమని నా నమ్మకం. కుటుంబపు భోజనం విషయం—నన్ను ఆదివారాలూ, సెలవురోజులూ భోజనానికి ఆహ్వానించారు. మాత్రియోనా యెటువంటి అద్భుతమైన వంటకాలను, రుచికరమైన పైలనూ బన్స్‌నూ తయారు చేస్తుందో నాకు తెలుసును. మేము బజారుకు లేదా, సమిష్టి క్షేత్రపు మార్కెట్టుకు వస్తువులు కొనుక్కోవడానికి తరచుగా వెళ్ళేవాళ్ళం. తప్పనిసరిగా మేము ఒకే వస్తువులను కొనేవాళ్ళం, నా సంచిలో వస్తువులు మాత్రం తక్కువగా వుండేవి.

ఆమె యింత చక్కగా పనులు ఎలా చేయగలిగేదని నాకు తరచు ఆశ్చర్యం వేసేది. మాకు కాస్త పరిచయం అయ్యాక ఆమెను నేను ఒకటడిగాను.

ఆమె సంతోష పూర్వకంగా జబాబు యిచ్చింది :

"మా ఆయన ఎప్పుడూ బాగా సంపాదిస్తున్నారు. ఆయన తెచ్చిన డబ్బుతో మేము కాలక్షేపం చెయ్యగలం. ఒక ముఖ్యమైన ఆదాయమేగనక లేకపోయినట్టయితే, మేము ఎంత పొదుపుగా గడుపుకున్నా, మాకు అనేక వస్తువులు వుండేవికాదు" అని ఆమె కొంటెగా చిరునవ్వింది.







సెంట్రల్ టెలిగ్రాఫ్‌కు చెందిన 9వ నెంబర్ శిశుపోషణాలయంలో పెద్ద కుమార్తె మాషా ఉపాధ్యాయిని (పైన).

ఫెదొసిక్కినా కుటుంబం ఒక ఆదివారపు సాయంత్రాన.

మాత్రియోనా ఫెదొస్కినా కుటుంబీకులంతా చుట్టు ముట్టి వుండగా ఫ్రాన్సు నుంచి వచ్చిన ఒక లేఖను చదువుతున్నారు. సుదూర దేశంలోని ఫ్రెంచి మిత్రుల ఛాయా చిత్రాలను చూస్తున్నారు పిల్లలు.

సోవియట్ ప్రభుత్వం నుండి పెద్ద కుటుంబాలుగల తల్లులకు ప్రత్యేకమైన అలవెన్సులు వస్తాయని తెలిసి వుండడంవల్ల, ఆమె ఉద్దేశాన్ని నేను సులువుగా కనిపెట్టగలిగాను. కాని ఫెదొస్కీనా కుటుంబంతో నాకు పరిచయం కాకముందర, యిది ఎంత పెద్ద సహాయమో నాకు తెలియనే తెలియదు.

ఒకరోజున మాత్రియోనా, ఆమె భర్త కుటుంబపు ఆదాయ వ్యయాలను లెక్కిస్తూ, తమ పిల్లల పోషణకోసం మొత్తం ప్రభుత్వపు అలవెన్సులుగా 70 వేల రూబుళ్లకు పైగా తమకు వచ్చిందని అంచనా వేశారు. ఇంతేకాకుండా, కుటుంబపు పిల్లలంతమంది యించుమించుగా శిశుపోషణాలయాలలోనూ, బాలోద్యానవనాలలోనూ పెరిగారు. వాస్తవానికి, వేసవినెలల్లో మాత్రియోనాకు బాధ్యతలన్నీ వదిలిపోతాయి, ఎందుకంటే పిల్లలు తమ బాలోద్యానవనాలతోనూ, శిశుపోషణాలయాలతోనూ గ్రామసీమలకు వెళ్తారు. ఇక్కడ పిల్లలకు యే కర్చు లేకుండా పోషణ జరుగుతుంది.

నిజమే, పిల్లలు పెరిగి పెద్దవాళ్ళవుతూ బడికి వెళ్తున్నప్పుడు బాధ్యతలూ, కర్చులూ ఎక్కువ అవుతాయి. కాని అప్పుడు కూడా వారికి ఉచితంగా వేసవి శిబిరాల్లో వసతి యివ్వబడుతుంది. జిల్లా విద్యాశాఖ, పూర్తిగా ప్రభుత్వ వ్యయంతో పిల్లలు పోషింపబడే ఒక బోర్డింగ్ పాఠశాలలో యూరీని వేస్తామని సూచించినప్పుడు తాను ఆశ్చర్యపడ్డానని, మాత్రియోనా నాకు చెప్పింది.

ఫెదొస్కీనా కుటుంబాన్ని బాగా జరుగుబాటుగల కుటుంబమని అనవచ్చును. ముగ్గురు పిల్లలు అప్పుడే పనిలోనికి వెళ్తూ, తమ ఆదాయాలను కుటుంబానికి యిస్తున్నారు. ఇద్దరు కొడుకులకు మంచి విద్యార్థి వేతనాలు వస్తున్నాయి. మాస్కో విశ్వవిద్యాలయంలో విద్యార్థినిగా వున్న వారి సోదరికి కూడా అంతే. శీతాకాలపు సెలవల్లో నన్ను భోజనానికి ఆహ్వానించారు. ఫెదొస్కీన్ కుటుంబం అంతా యింట్లో వుంది. అన్నిటికంటె పెద్ద గదిలో పెద్ద మేజాలు కలిపి వేశారు, అయినా కిక్కిరిసిపోయి వుంది.

కుటుంబం అంతా యింట్లో వుండడం, నేను మొదటిసారి చూడడం యిదే. ఆరోగ్యంగా, సంతోషంగావున్న ఈ పిల్లలందర్నీ చూడటం చాలా ఆనందంగా వుందని చెప్పక తప్పదు. ఆది ఎంత చక్కని కుటుంబమో నేను గ్రహించగలిగాను.

మాత్రియోనా నా భావాలను గ్రహించినట్టుంది, ఆమె సగర్వంగా చిరునవ్వింది.

ఆమె నిజంగా గర్వించవలసిన కారణంవుంది. పెద్దమ్మాయి మాషా, మా అందరికీ జీవితం కష్టసాధ్యంగా వున్న రోజుల్లో పుట్టింది. కాని ఆమెకు సెకండరీ పాఠశాలలో విద్య లభించింది, శిక్షణ పొందిన వైద్యపు దాదిగా పనిలో ప్రవేశించింది. వాసిలీ, మాస్కో ముద్రణా విద్యాశాలలో విద్యాభ్యాసం చేశాడు, భూగోళ శాస్త్ర సారస్వత ప్రచురణాలయంలో పనిచేస్తున్నాడు. ఇవాన్ ఎప్పుడూ చిత్రకళలో ప్రతిభావంతుడు; ఉన్నత చిత్రకళా పాఠశాలలో పట్టం పుచ్చుకున్నాక చిత్రకారుడయ్యాడు. అలెక్సీకీ, నికోలాయ్‌కీ మధ్య తేడా ఒక్క ఏడాది మాత్రమే. ఇద్దరూ పొడవుగా, దృఢంగా వుంటారు. పాఠశాలలో విమానాల నమూనాలను తయారు చేయడంలో ఆసక్తిని చూపేవారు, యిద్దరూ విమానాలను నిర్మించే యింజినీర్లు కావడానికి నిశ్చయించుకున్నారు. సంతోషంగా, సరదాగా వుండే మారియా విశ్వవిద్యాలయ భాషాశాస్త్రశాఖలో యిప్పుడు మూడవ సంవత్సరం తరగతిలో వుంది.

ఇక చిన్నపిల్లలు విస్సారియొన్, వాల్యా, తాన్యా, పెత్యా బడికి వెళ్తున్నారు. కవలలు ఒలెగ్, ఇగొర్ బాలోద్యానవనానికి వెళ్తున్నారు, ఈ యిద్దరు కుర్రవాళ్ళకు ఆరవ జన్మదినోత్సవం యిటీవలనే జరుపబడింది.

ఈ చిన్న పిల్లలు ఏ వృత్తిలో ప్రవేశిస్తారో యిప్పుడే చెప్పడం కష్టం. ఏమైనా, వారి భవిష్యత్తు గురించి చింతపెట్టుకో నక్కరలేదు.

"వాళ్లు ఆరోగ్యంగానూ, తెలివిగానూ వుండి, కష్టపడి చదువుకుంటూవుంటే వాళ్ళకు యిష్టమైన వృత్తి యెప్పుడూ దొరుకుతుంది" అని మాత్రియోనా నాతో చెప్పింది.

"పిల్లలవల్ల ఎవ్వరూ వృద్ధులయిపోరు. ఎవరినైనా వృద్ధులుగా చేసేది, లేమి, తమ పిల్లల భవిష్యత్తు గురించి ఆందోళన" అని ఆమె అన్న మాటలు నాకు జ్ఞాపకం వచ్చాయి.

ఫెదొస్కీనా కుటుంబంలో యీ ఆందోళన లేదు, లేమి కూడా లేదు. 62 ఏళ్ళ వయస్సులో మాక్సిం కళ్ళలో యవ్వనం కనిపించడానికీ, మాత్రియోనా జడలలో నెరిసిన వెంట్రుక ఒకటికూడా లేకపోవడానికీ యిదేకదా కారణం.

"నా జీవితం యిలా వుంటుందని ముప్ఫయ్యేళ్ళ క్రితం యెవ్వరైనా చెప్పివుంటే" అంటూ ఒకరోజున మాక్సిం నా దగ్గర ఒప్పుకున్నారు, "నేను నమ్మివుండే వాణ్ణికాదు. ఇంతకూ నేను ఎవణ్ణి? ఒక పేదరైతు కుటుంబానికి చెందినవాణ్ణి, నేలకు మెరుగు పెట్టే సామాన్య కార్మికుణ్ణి, పెద్దవాణ్ణయ్యాక నేను చదవడమూ, వ్రాయడమూ నేర్చుకున్నాను. కాని నా కొడుకులు, ఒకడు చిత్రకారుడు, రెండోవాడు సంపాదకుడు, యిద్దరు యింజినీర్లవుతారు, మా అమ్మాయి రచయిత్రి అవుతుందేమో ఎవ్వరెరుగుదురు? మా చిన్న పిల్లలు మా కుటుంబానికి తలవంపులు తీసుకరారని నానమ్మకం."



# కొత్త ఇళ్ళలోకి పోతున్న లక్షలాది ప్రజ

ఎస్. వినొగ్రదోవ్

"స్ట్రోయ్ తెల్నయా గజెతా" ("నిర్మాణ పత్రిక") విలేకరిగా నేను ఇటీవలి సంవత్సరాలలో యించుమించు దేశమంతా పర్యటించాను, బ్లాస్ట్ ఫర్నేసులను మండించడం, ఇంజినీరింగ్ పరిశ్రమలను, జల విద్యుత్కేంద్రాలను ప్రారంభించడమూ చూశాను, కొత్త యిళ్ళలోనికి మారినప్పుడు కార్మికుల గృహప్రవేశ ఉత్సవాలకు చాలాసార్లు వెళ్లాను.

యుద్ధం అయ్యేక మొదటి పదేళ్ళలో నగర ప్రజలకు, నూరు స్టాలిన్‌గ్రాడ్ నగరాలకు మించిన యిళ్ళ జాగాగల గృహాలు లభించాయి.

నూరు స్టాలిన్ గ్రాడ్‌లు!

గ్రామాలలో ఏభై లక్షలకుపైగా యిళ్ళను రైతులు కట్టుకున్నారు.

సోవియట్ పరిపాలనాకాలంలో మాస్కో, విప్లవానికి పూర్వపుకాలం అంతటికంటె అధికంగా యిళ్ళను కట్టింది. ఆరవ పంచవర్ష ప్రణాలికా కాలంలో మాస్కో పురవాసులు యిప్పుడున్నంతగా. అంటే ఐదేళ్లలో యింకో మాస్కోను నిర్మించడానికి ఉద్దేశిస్తున్నారు.

ఒక్క గత ఏడాదిలోనే సోవియట్ దేశంలో 3 కోట్ల 60 లక్షల చదరపుమీటర్ల ఇళ్ళు నిర్మింపబడ్డాయి? ఇది చాలా ఎక్కువా? ఈ మొత్తం



కీవ్‌లో ఔత్సాహికులు నిర్మించిన ఒక గృహం. బాగానే వుంది కదూ?

కీవ్, బాకూ, గోర్కీ, కార్కోవ్, స్వెర్ద్ లోవ్‌స్క్, ఛెల్యబిన్‌స్కీ నగరాలను కలిపితే వుండే యిళ్ళ జాగాకు సమానం. ఉదాహరణకు కీవ్, బాకూ నగరాలకు ఒకొక్కదానికి పదిలక్షలకు దగ్గరగా జనాభా వున్నదనీ, స్వెర్ద్‌వ్‌లోస్క్, గోర్కీ నగరాలకు ఆ సంఖ్యకు దగ్గరగా జనాభా వున్నదనీ చెప్పవలసి వుంటుంద.



ఇంత తక్కువ కాలంలో యెక్కడా కూడా యింత ఎక్కువ సంఖ్యలో ఇళ్లు నిర్మింపబడలేదని, పాఠకులు బహుశా అంగీకరిస్తారనుకుంటాను.

మేము ఎక్కువగా నిర్మించినప్పటికీ, మా దేశంలో బలోపేతమైన నిర్మాణ పరిశ్రమ పెంపొంది నప్పటికీ, విశాల మైన మంచి యిళ్ళకు అవసరం యింకా యీడేర్చబడలేదు. సామ్యవాద సమాజంలో ప్రతి ఒక్క కుటుంబానికీ సదుపాయమైన మంచి ఇల్లు యివ్వబడాలనీ, కుటుంబంలోని ఒక్కొక్కరికీ చిన్నదయినా ప్రత్యేకంగా ఒక గది వుండాలనీ లెనిన్ చెప్పిన వాక్కులు మాకు జ్ఞాపకం వున్నాయి. కాని మేము ఇంకా దీనిని యీడేర్చ లేకపోతున్నాము.

ఎందువల్ల ? ప్రజల అవసరాలు చాలా తొందర తొందరగా పెరిగిపోతూ వుండడమువల్ల, నగర జనాభా పారిశ్రామికాభివృద్ధితో పెరిగిపోతూ వుండడంవల్ల. దీనికి యింకో కారణంకూడా వుంది. ముఖ్యంగా కార్మికులు తక్కువగా వుండడమువల్ల నిర్మాణ సంస్థలు తమ విధులను నెరవేర్చుకోలేవు.

గ్లావ్ మోస్త్రోయ్ (కేంద్ర మాస్కో నిర్మాణ సంస్థ) వంటి ఒక పెద్ద సంస్థ —యిది మాస్కో వాసులకు సాలుకు 1.5 మిలియన్ చదరపు మీటర్ల యిళ్ళ జాగా నిస్తుంది—కనీసం ఇంకో యిరవై వేల మందయినా కార్మికులు కావాలని పట్టుపడుతోంది. కాని వాళ్లెక్కణ్నుండి వస్తారు ? పూర్వం సరఫరా చేసేస్థలాలు —పేదపడిన గ్రామాలూ, దరిద్రులైన రైతులు, నిరుద్యోగ సమూహమూ— యిప్పుడు లేవు. యువకులు చదువుకుంటూ వుండడమో, లేదా యిప్పటికే పనిలో వుండడమో జరుగుతోంది.

నిర్మాణ యాంత్రికీకరణ సోవియట్ దేశంలో బాగా వ్యాపించింది. ఇందువల్ల నిర్మాత పని తగ్గుతుంది, అతని ఉత్పాదన శక్తి ఎక్కువ అవుతుంది. కాని ఇదికూడా సమస్యను పూర్తిగా పరిష్కరించదు.



కట్టడపు పని చేస్తోన్న ఔత్సాహికులు

కాని గృహనిర్మాణం చాలా ముఖ్యమైనది కావడంవల్ల, యిళ్ళ అవసరం చాలా ఎక్కువగా వుండడంవల్ల, ఒక మార్గం కనుగొనబడింది. అదేమిటి ?

"స్త్రోయ్‌తెల్నయా గజెతా" కొత్త సంవత్సరపు సంచిక, కీవ్‌కు చెందిన ఔత్సాహిక ఛాయాచిత్ర గ్రాహకుని చిత్రం ఒకటి ముద్రించింది (రేప చిత్రం చూడండి). ఇది ఎక్కువ బాగా లేదు. వృత్తి ఛాయాచిత్రగ్రాహకుడు తీసినది కాదిది. కాని యిందులో ముఖ్య విషయ యేమిటంటే, యిది చూపే యిల్లుకూడా వృత్తి నిర్మాతలు నిర్మించినది కాదు.

(మిగత ౩౩వ పుటలో)



# నవ్య మార్గం

„నోవి పుత్" (నవ్యమార్గం") అన్నది, శాఖలిన్ దీవిలోని నానాయన్ జాలర్లు తమ సహకార సంఘానికి పెట్టిన పేరు.

ఈ సమిష్టి మత్స్య పరిశ్రమ కొత్తగా ఏర్పడినది. నవ్వుతోన్న ఆ పిల్లల తలిదండ్రులు భాగ్యవంతమైన శాఖలిన్ దీవికి ఐదేళ్ళ క్రితం, తమ పూర్వీకుల దేశమైన అమూర్ నదీ లోయనుండి (దిగువ, కుడివేపు చిత్రం) వచ్చారు.

నానాయన్లు కష్టపడి పనిచేసిచేసే చిన్న జాతికి చెందిన ప్రజలు, శతాబ్దాలుగా వేట, చేపలు పట్టడంలో ప్రవీణులుగా వున్నారు. సమిష్టి మత్స్యపరిశ్రమ వృద్ధ సభ్యులు, నానాయక్ జాలర్లు, వేటగాళ్ళ ముఖ్య ఆయుధాలు పంట్రకోలు, చెకుముకి రాయి తుపాకిగా వుంటూవుండే ఒక అర్ధ శతాబ్దపు క్రితపు రోజులను జ్ఞాపకం తెచ్చుకొంటున్నారు. వారితాతలు పులులను విల్లంబులతోనూ, యీటెలతోనూ వేటాడేవారు....

సోవియట్ పరిపాలనలో, గత నలభై ఏళ్ళలో చాలా మారిపోయింది. ఒక తరంనుండి యింకో తరానికి వచ్చే అనేక సంవత్సరాల వేట అనుభవంతో బాటుగా యీనాడు నానాయక్ జాలర్లకు ఒకటోరకం వస్తుజాలం—మోటారు చేపల వేట పడవలు, సరికొత్తరకాల పనిముట్లు లభించాయి.









వీటివల్ల మంచివేట దొరుకుతుంది.

అమూర్‌నుండి వచ్చి పునరావాసం ఏర్పరుచుకున్నవీరు, ఈడలతో కట్టి, మట్టిపూసిన గుడిసెలు తప్ప యింకో యిళ్ళు ఎరగని వారి పిల్లలూ, మనుమలూ యిప్పుడు చిన్నవేఅయినా, బాగా అధునాతనంగానూ, వదుపాయంగానూ వున్న కుటీరాలను నిర్మించుకుంటున్నారు (ఎడమ, దిగువ చిత్రం).

భాగ్యంతో బాటుగా సంస్కృతి కూడా యీ చిన్నజాతి ప్రజలకు లభించింది. జాలర్ల పిల్లలంతా ఈ సెటిల్మెంట్ పాఠశాలలో తమ మాతృభాషలో చదువుకుంటున్నారు. నానాయన్ ప్రజలలో ఉన్నత విద్యను పొందినవారు చాలామంది వున్నారు.

కొత్తదేశమైన ఈ శాఖలిన్‌లో చక్కని జాతీయ సాంప్రదాయాలూ, ఆచార వ్యవహారాలు మరుపున పడలేదు. ఎగువను ఎడమపైనవున్న చిత్రంలో ఒక జాలరి దళనాయకుని భార్య చెప్పులకు అలంకారులను కుట్టుతూ వుండడం కనిపిస్తుంది. చిత్రంలో కనిపించే నానాయ్‌ల అలంకారం ఎన్నో ఏళ్ళ క్రితం ప్రతిభావంతులైన కళాకారులనుండి ఉద్భవించింది.

"నొపీ పుత్" సహకారసంఘపు జాలర్లు, ఉస్సురీ భూభాగంలోని అమూర్ తీరపు తమ సోదరులలాగనే, జీవితంలోనూ, శ్రమలోనూ ఒక నవ్యమార్గాన్ని చేపట్టారు.











# ఔత్సాహికులైన తోటమాలులు

> పి. ఒయిత్సెఖోవ్‌స్కీ <

రమెన్‌స్కీ పరిశ్రమ కార్మికుల యాజమాన్యాన మాస్కోకు చేరువలో ఒక పళ్ళతోట వుంది. దానిని కార్మికులే సాగుచేస్తూ, పోషిస్తున్నారు. దానిని వారు "శాంతి" తోట అని అంటారు.

పురపాలకులు కార్మికులకు మాస్కోకు అవతల కాస్త బంజరు భూమిని యిచ్చారు. మూడేళ్ళలో వారు దానిని అందమైన తోటగా పరివర్తనం గావించారు. ఆ ప్రాంతమంతా చెట్లతోనూ, పూలతోనూ నిత్యకల్యాణం, పచ్చతోరణంగా వుంది. బలహీనమైన మొక్కలకు గాలి దెబ్బ తగలకుండా కార్మికులు చిన్న పోప్లార్లను నాటేరు, వారొక రోడ్డు వేశారు, చిన్న చెరువు త్రవ్వారు, పైపులు వేశారు. విద్యుచ్ఛక్తి, టెలిఫోను కూడా వుంది.

ఈ తోటమాలులు వసూలు చేసిన పైకంనుండి యీ ఖర్చులన్నీ జరిగాయి, పరిశ్రమలోని కార్మిక సంఘం కేటాయించిన డబ్బుకూడా యిందుకు ఉపయోగింప బడింది. రవాణానూ సేద్యం చేయడానికి యంత్రాలను కూడా పరిశ్రమే ఏర్పాటు చేసింది.

ఈ పళ్ళ తోటకు సంబంధించిన కుతూహల జనకమైన ఒక విషయమేమిటంటే, యిది సమిష్టి సంపద అయినప్పటికీ యీ భూమి వ్యక్తి ప్రాతిపదికపైని ఉపయోగింప బడుతోంది. ప్రతిఒక్క మాలీకి అరువందల చదరపు మీటర్ల స్వంత మడిచెక్క వుంది. దీనిమీద అతను పళ్ళచెట్లనూ, చిన్నపళ్ళ పొదలనూ, పూల మొక్కలనూ నాటు



తాడు, చిన్న వేసవి గృహాన్ని కట్టుకుని విశ్రాంతి తీసుకుంటాడు. తన విరామ కాలాన్ని గడుపుతాడు.

మొదట్లో చాలామంది కార్మికులకు పళ్ళ తోటల గురించి తెలిసినది చాలా అల్పం. పరిశ్రమలో సాంకేతిక నిపుణుడైన అలెగ్జాండర్ బొబిలెవ్ పళ్ళతోటలను ఎలా వేస్తారో అన్నదాని గురించి తనకు సరిగ్గా ఏమీ తెలియదని ఆరోజుల్లో ఒప్పుకున్నాడు. కాని యిప్పుడతను అనుభవజ్ఞుడైన తోటమాలీగా పరిగణింప బడుతున్నాడు. చాలామంది అతని సలహాకోసం వెళ్తుంటారు. ఆపిల్ చెట్టుపై కొమ్మలను కత్తిరించవలసి వచ్చినప్పుడు కత్తెరను ఎలా ఉపయోగించాలో ఆయన ఎరుగును, ద్రాక్ష చెట్టు కొమ్మలు ఎలా నరకాలో ఎరుగును.

(మిగతా ౩౮వ పుటలో)

# లెనిన్ బహుమాన
# సెర్గీ



"రుసెన్ గాయకుడు". కరేలియన్ జానపద గాయకుని శిల్పం

ఈ వ్యక్తిలో ప్రతి ఒక్కటీ అసాధారణం గానూ, ఆశ్చర్యకరంగానూ వుంటుంది—ఆయన జీవితమూ, ఆకారమూ, ఆయన జీవించే యిల్లు సైతం. ఆయన యిల్లు మాస్కో లోని జనంతో కిక్కిరిసివున్న ఒక వీధిలో వుంది. ఇక్కడ రాత్రిపూటకూడా మాటలు వినిపిస్తూనే వుంటాయి. కాని ప్రక్కదోవ నుండి తలుపువద్దకు తీసుకవెళ్ళే మూడు చిన్న మెట్లను ఎక్కి గంటను నొక్కగానే—యిది, శిల్పి యస్. టి. కొనెన్కోవ్ అని చెక్కి వున్న రాగి రేకుకు ప్రక్కగా వుంది—అంతా కొత్త రూపం దాల్చుతుంది, మీరు కొత్త రాజ్యంలో ప్రవేశిస్తారు.

మొదట ఆ గృహస్తుడే మిమ్మలను ఆశ్చ ర్యపర్చుతాడు, యీయనది బ్రహ్మాండమైన విగ్రహం, ప్రవక్తలకుండేటటువంటి శిరస్సు ఆయనది. ఆయన జుట్టు ఇంచుమించు అంతా నెరసిపోయింది, అది చిందరవందరగా వెనుకకు నెట్టబడింది. ఆయన కనుబొమలు యోచనా పరత్వాన్ని సూచిస్తాయి. దట్టంగా వున్న ఆయన కనుబొమలు చురుకైన ఆయన కళ్ళకు వేలాడుతూ వున్నట్టుగా వున్నాయి. ఆయన దవడలను పెద్దగడ్డం కప్పి వుంది. ఆయన చాలా నిరాడంబరంగా దుస్తులు వేసుకున్నారు, కళాకారులు వేసుకునేటటువంటి ముతక లినెన్ కబ్బానూ, యింట్లో వేసుకునే వెచ్చని చెప్పులనూ వేసుకుని వున్నారు.

మీరు చాలా వినివున్న సెర్గీ కొనెన్కోవ్ "వస్తుప్రదర్శన గృహం" యీ విధంగావుంది. ఇది నిజంగా ఒక వస్తు ప్రదర్శనశాల. మేము కూచొనివున్న గది చాలా సామాన్యంగా, మరీ పెద్దదీ కాకపోయినప్పటికీ. కాని దానిలో వున్నవన్నీ—చెక్కడపుపని చేసిన కర్ర కుర్చీలూ, పడకకుర్చీలూ, మేజా, బెంచీలు—కళాకారుని అపార ఊహావిహారం వల్లనూ, కళాకారుని ప్రకృతి ప్రేమవల్లనూ మాత్రమే సృష్టింపబడాలి. చక్కని ముడులలోనూ, చెట్లవేరుల గుంపులలోనూ తన హృదయానికి ప్రీతిపాత్రమైన యీ రూపాలను ఆయన మాత్రమే చూడగలడు. కుర్చీల చేతులనుండీ, వెనుకభాగాలనుండీ జంతువుల కళ్ళు తొంగి తొంగి చూస్తున్నాయి—నెమ్మదైన ఆడుజింక కళ్ళు, బద్ధకపు గొర్రెకళ్లు. హంస మెడకున్న చక్కని వంపు, యించుమించు మనిషి చూపు వంటి దాని చూపు మిమ్మలను ఆకర్షిస్తుంది. రష్యన్ ఎలుగుబంటి పిల్ల మిష్కాను చూసి మీరు చిరునవ్వుతారు. ఇది యీ కళాకారునికి చాలా ప్రీతిపాత్రమైనది.

ఆరణ్యంపట్ల, దానిలోవుండేవాటిపట్ల ఇంత ప్రేమ ఎక్కణ్నుండి వచ్చింది ?

దట్టమైన స్మొలెన్స్క్ అడవులలో ఒక గ్రామంలో కళాకారుడు తన బాల్య కౌమార దశలనుగడిపారు. ఆయన ప్రకృతిని ప్రేమిస్తూ పెరిగి పెద్దవారయ్యారు, బాలునిగా దాని సౌందర్యంలో లీనమైపోయారు. ఈ మమకారం యావజ్జీవితమూ ఆయనలో వుండిపోయింది. పిల్లలందరికి వలెనే ఆయనకు కూడా దేవతా కథలంటే ఎంతో యిష్టంగా వుండేది. వాటిలో

# విజేత కొనెన్కోవ్

ముఖ్యపాత్రలు రష్యన్ జానపద నాయకులు, రాకుమార్తెలు, మాత్రమే కాకుండా, దుష్టులైన తోడేలూ, టక్కరి నక్క, సాధు మూర్తి అయిన లేడి, తెలివిగల గుడ్లగూబ,

**యస్. లోర్ధకిపనిడ్జె**

ఆ మంత్రజాలపు జీవులైన గంధర్వ కన్యలూ, అడవి దయ్యాలూ....

కళాకారుని బాల్యం ఆయన భావవీధిలో చక్కని మూర్తులలో ప్రతిబింబిస్తున్నాదిక్కడ. మనం వాటిని కనులపండువుగా చూడవచ్చును. కాని కొనెన్కోవ్ తన స్టుడియోలోకి మమ్ము లను తీసుకపోతూ చిరునవ్వారు మాత్రం— అప్పుడేనా, చూడవలసినవి యింకా చాలా వున్నాయి అన్నట్టుగా.

ఈ కళాకారుని ఎక్కువగా ఆకర్షించిన హంశాలేమిటి? ఈ ప్రశ్నకు సూక్ష్మంగా జవాబు చెప్పడం కష్టం. అందంగా వున్నదీ, ప్రముఖంగా వున్నదీ ఏదీ ఆయనను ఉత్సాహ పర్చకుండా వుండదు గాబట్టి.

కొనెన్కోవ్ ప్రపంచంలో చాలా ప్రాంతా లకు వెళ్లారు. ఆయన ఫ్రాన్సుకూ, ఇటలీకీ, ఈజిప్టుకూ, అమెరికాకూ వెళ్లారు. ఆయన శిల్పాలు చాలావాటిలో యీ యాత్రల ప్రభావం కనిపిస్తుంది.

కాని యీ అతిసుందరమైన శిల్పాలు కావు



ప్రఖ్యాత సోవియట్ శిల్పి సెర్గీ కొనెన్కోవ్ తన స్టుడియోలో →

"నైక్", చలవరాతి విగ్రహం. 1906 ↓



మనలను యెక్కువగా కదిల్చి వేసింది. మన లను ఆకర్షించినవి, మనం ఆయన స్టుడియోలో చూసిన మహోన్నత మానవ భావ మూర్తులైన రష్యన్ రచయిత ఫైదోర్ దోస్తోవస్కీ, ఇటా లియన్ ఫీడేలు వాద్యకారుడు నికోలా పిగనినీ, వాగ్గేయకారుడు సెర్గీ రచ్మనినోవ్, గాయకుడు ఫైదోర్ ఛలియపిన్, కవి వ్లాదిమిర్ మయ కొవస్కీ, విజ్ఞానశాస్త్రవేత్త ఇవాన్ పావ్లోవ్. ఈ చిత్రాలలోనూ, యింకా చాలా వాటిలోనూ కొనెన్కోవ్ మానవులలో ఎక్కువగా విలువ నిచ్చే శీవి నిండివుంటుంది. దానికీ గర్వాతిశ యానికీ యేమీ సంబంధం లేదు. అది మానవ కోటిపట్ల ప్రేమ గౌరవాలపైని ఆధారపడినది. కొనెన్కోవ్ జీవితం యావత్తు ఆయన అభి ప్రాయాలనూ, ఆదర్శాలనూ రుజువు చేస్తుంది. రష్యన్ జారిజం కష్టదినాలలో యువకునిగా



యీయన సామాన్య ప్రజల ప్రయోజనాలనూ, స్వేచ్ఛా సమానత్వాలనూ బల పర్చారు. కార్మికుని చలవరాతి శిరస్సు, బారికేడ్స్ వద్ద స్వాతంత్ర్య యోధునికి చిహ్నంగా వుంది. ఇక్కడ "నైక్" స్వాతంత్ర్య దేవతే వుంది. ఇతర కళాకారులు చిత్రించే సాంప్రదాయక దేవతలకూ, యీమెకూ ఎంత భిన్నత్వము వుంది. తియ్యని ముఖంతోనూ, ఆనందం చిందే చిరునవ్వుతోనూ వున్న సామాన్య రష్యన్ బాలిక యీమె.

"స్వీయ చిత్రం"లో కొనెన్కోవ్ ఆదర్శాలు సంపూర్ణంగా సాక్షాత్కరించాయి. ఇది 1951 లో చలువరాతి పైని చెక్కబడింది, యిది ఆయన 80 వ జన్మదినోత్సవ సంవత్సరం. సోవియట్ ప్రజలు సెర్గీ కొనెన్కోవ్ పట్ల చూపిన ప్రేమ, గౌరవమూ ఎంతో ఘనమైనవి. లెనిన్ పారితోషిక బహూకృతుడు అన్న బిరుదాన్ని యీయనకు మొదట అర్పించడంలో యీ భావాలు వ్యక్తమయ్యాయి.

---

"1905లో కార్మిక యోధ బృంద సభ్యుడు ఇవాన్ చుర్కిన్." చలవరాతి విగ్రహం

# ప్రజల భవిష్యత్తు — ప్రజల హస్తగతం

(2వ పుట తరువాయి)

క్యానికి హామీనిస్తూ సామ్యవాద దేశం, పౌరుల ఆధీనంలో ముద్రణాలయాలనూ, కాగితాన్నీ, సమావేశాలకు, సభలకూ గృహాలనూ మొదలైనవాటిని పెట్టి యీ స్వేచ్ఛలను అనుభవించడానికి భౌతిక పరిస్థితులను కల్పిస్తుంది.

చివరలో, సోవియట్ దేశంలో జాతుల సమానత్వ విధానం నిరంతరం అమలు జరుపబడటం గురించి ప్రసంగిస్తాను. నిజమైన ప్రజాస్వామ్యానికి యిది అతి ముఖ్యమైన చిహ్నాలలో ఒకటి. తొలి నాళ్ళనుండీ సోవియట్ రాజ్యం అన్ని ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక జీవిత రంగాలన్నిట్లో రష్యాలో నివసించే సకల జాతుల, తెగల సంపూర్ణ సమానత్వాన్ని ప్రకటించింది. సోవియట్ దేశ రాజ్యాంగం జాతి, తెగ విషయాలలో ఎటువంటి విచక్షణనైనా పెద్ద నేరంగా పరిగణిస్తుంది.

అయినా సమానత్వ సమస్య శాసన పద్ధతిలో మాత్రమే కాకుండా, ముఖ్యంగా వెనుకబడిన జాతులను అభివృద్ధి చెందిన జాతులస్థాయికి తీసుకపోవడం ద్వారా, స్వీయ పరిశ్రమలను, బాగా అభివృద్ధిచెందిన వ్యవసాయాన్నీ జాతుల రిపబ్లిక్కులలో సృష్టించడం ద్వారా, ఉన్నతార్హతలుగల జాతీయ కాడర్లను తర్ఫీదు చేయడం ద్వారా పరిష్కరింపబడింది. ఈ విధంగా అనేకవేల కార్మికులు పనిచేసే 300కు పైగా ఆధునాతన పారిశ్రామిక సంస్థలు తజికిస్తాన్లో —విప్లవానికి పూర్వం 29 చిన్న చేతిపనుల పరిశ్రమలు మాత్రమే గల చోట—నిర్మింపబడ్డాయి. సోవియట్ దేశంలోని చాలా జాతుల ప్రజలు లిఖిత భాషను, స్వీయ సారస్వతాన్నీ విప్లవం తరువాతను మాత్రమే పొందారు. ఈనాడు సుమారు అన్ని రిపబ్లిక్కులకూ స్వంత విజ్ఞానశాస్త్ర పరిషత్తులూ, వేలాది పరిశోధనా సంస్థలూ వున్నాయి; పూర్వం జారిస్టు రష్యా సరిహద్దుప్రాంతం ఒక్కదానిలోనూ స్వంత వైజ్ఞానిక కేంద్రం ఒక్కటికూడా వుండేది కాదు.

సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్యం యొక్క నలభై సంవత్సరాల అభివృద్ధి ఫలితాలు యిటువంటివి.



# అజర్‌బైజాన్లో హిందూ దేవాలయం

ఎడ్విన్ గ్రంతోవ్‌స్కీ

సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర
పరిషత్తు అధ్యయన శాల
విజ్ఞానశాస్త్రజ్ఞుడు

రేళ్ళకు పైగా, 1847 వసంతంలో ట్రాన్స్ కకాసస్‌లోని పెద్ద నగరాలలో ఒకటైన తిఫిలిస్ ప్రజలు (యిప్పుడిది జార్జియా ముఖ్య నగరమైన తిబిలిసి) చాలా అసాధారణమైన అంత్యక్రియలను చూశారు. ఒక బ్రాహ్మణ యాత్రికుడు నగరంలో మరణించినప్పుడు, అతని అంత్య వాంఛల ననుసరించి, ఆయన అంత్యక్రియలు హిందూ కర్మకాండ ననుసరించి జరుపబడ్డాయి. ఈ విషయంమీద వ్యాఖ్యానిస్తూ తిఫ్లిస్ వార్తా పత్రిక "కకాసస్" యీ విధంగా వ్రాసింది · "ఈ బ్రాహ్మణునికి హిందూధర్మ కర్మకాండ ననుసరించి దహన సంస్కారం జరిగింది; ఆయన చితా భస్మం కురానదిలో వేయబడింది, కాస్పియన్ సముద్రానికి ప్రవహించే యీ నది వాటిని అమర జ్వాలల తీరానికి తీసుకపోయేందుకు...."

ఈ బ్రాహ్మణుని స్నేహితుల మనసులో వున్న, కాస్పియన్ తీరపు అమరజ్వాలలేమిటి?

## సురఖనీ జ్వాలలు

సోవియట్ అజర్‌బైజాన్ ముఖ్యపట్టణం బాకూ సమీపంలోవి ఆప్షెరొాన్ ద్వీపకల్పం యెందుకు ప్రసిద్ధి చెందినదని యీనాడు ఏ బడి కుర్రవాణ్నయినా అడగండి, వాడు జంకూ గొంకూ లేకుండా "నూనె" అని జవాబు చెప్తాడు ఈ జిల్లా "నల్ల బంగారా" నికి నిలయం. అయినా నూనె యిటీవలవరకూ, నూరేళ్ల క్రితంవరకూ ప్రజలదృష్టి నాకర్షించ లేదు. అప్షెరొాన్ కీర్తి యింతకు ముందునుండీ



వస్తున్నప్పటికీ. అనాది కాలంనుండీ, చిన్న అధునాతన నగరమైన సురఖనీకి దగ్గర్లోనే అక్కడ నేలపైనుండి మంటలుపుడుతున్నాయి. నూనె వున్నచోట సాధారణంగా వుండే రంగు లేని కాలే గ్యాసులవల్ల కలిగినవవి. ప్రాచీన ఇరాన్‌లో బహుళ వ్యాప్తిని గాంచిన మతావలంబకులైన జొరాస్టర్ అనుయాయులు మన శకపు తొలి శతాబ్దాలలోనే యీ మండలంకు పూజ చేసేవారు కొన్ని శతాబ్దాల తదుపరి జొరోస్ట్రియనిజం స్థానంలో ఇస్లాం వచ్చింది, అగ్ని పూజను చేసే చిన్నచిన్న బృందాలు మాత్రమే మిగిలిపోయాయి వీరు భారత దేశానికి పారిపోయిన పార్శీలూ, పెర్షియాలో వుండిపోయిన కొద్దివేలమంది "హీబ్రూలూ". కాని సురఖనీ మంటలు, పూర్వంలాగానే పేరు ప్రఖ్యాతులను అనుభవిస్తూనే వున్నాయి. అరేబియన్ పండితుడు మసూదీ పదో శతాబ్దంలో వాటిని " రించి వ్రాసేడు; పన్నెండవ శతాబ్దం నుండీ అజర్ బైజాన్లోని యాత్రికులు యించుమించుగా అందరూ యీ అమరజ్వాలలగురించి మాటాడడం మాత్రమే కాకుండా, వాటికి చేరువలో నిర్మింపబడిన అగ్ని ఆరాధకుల దేవాలయము గురించికూడా చెప్పేవారు. వారందరూ తురుష్క జాతికి చెందిన ఛెలెబీ, జర్మన్ కాంఫెర్, ఆంగ్లేయుడు హాన్వే, రష్యన్ గొలిత్సిన్ సురఖనీలోని దేవాలయాన్ని పార్శీలకూ, హీబ్రూలకూ పుణ్య స్థలంగా పరిగణించారు.

రష్యన్ విజ్ఞానశాస్త్ర పరిషత్తుచే యీ దేవాలయ పరిశీలనార్ధం బాకూకు పంపబడిన రష్యన్ ప్రాచ్య విద్యాధ్యయన వేత్త బెరెజిన్ అభిప్రాయం కూడా యిదే.

## బెరెజిన్ రాయబారం

సాయంత్రం చీకటిపడుతూ వున్నప్పుడు దేవాలయానికి వెళ్ళమని, నగరంలోని వృద్ధులు బెరెజిన్‌కు సలహా యిచ్చారు. "అప్పుడది యింకా మనోహరంగా వుంటుంది" అని వాళ్లు చెప్పారాయనకు. ఆ ప్రకారం ఆ రష్యన్ పండితుడు సంధ్యాసమయంలో బాకూనుండి బయలుదేరి తరవాత తన అభిప్రాయాలను యిలా వ్రాసేరు :" మేము సమీపిస్తున్న కొద్దీ పెద్ద దవుతోన్న వెలుతురు, మేము కొండ నెక్కాక పూర్తిగా కనిపించింది. మొదట మేము ఆ మంటల ముఖ్యమైన జ్వాలలను మాత్రమే చూడగలిగాము; దగ్గరకు పోయిన తరవాత మాత్రమే నేలనుండి పైకెగ ప్రాకుతోన్న తక్కిన జ్వాలలను చూడగలిగాము ...సకల వర్ణాలతోనూ కూడిన యీ అగ్ని స్థంభాలకు గాలులు వింతవింత ఆకారాలను కల్పిస్తున్నాయి. ఈ ప్రకాశంలో హిందువులు నివసిస్తోన్న యింటి ప్రమాణాలను మసక మసకగా చూడగలిగాము. ప్రత్యేకంగా కట్టిన చిమ్నీల నుండి పతాకాలలాగా మంటలుప్రవహిస్తోంటే."

ఆ దేవాలయ భక్తులు బెరెజిన్‌కు అతిధి మర్యాదలతో స్వాగతం యిచ్చారు. మర్నాడు తాను పూజారులతోనూ, యాత్రీకులతోనూ మాటాడినప్పుడు ఆయన ఆ యింటిని పూర్తిగా పరీక్షించగలిగాడు. ఆ దేవాలయమూ, దానికి చుట్టుప్రక్కల నున్న కట్టడాలూ, సరిగ్గా ఇప్పుడున్నట్టుగా అప్పుడున్నాయి. ఆ దేవాలయం బూడిదరంగు రాతితో కట్టిన చతురస్రాకారపు కట్టడం నాలుగు గోడలకూ ఒక ఎత్తయిన ఆర్చి వుంది. దేవాలయం మధ్యను ఒక బలి వేదిక వుంది, పై కప్పుకు ఒక గుండ్రని గంట వుంది. ఈ నిర్మాణం అంతటికీ చుట్టూతా ఒక గోడవుంది. దీనికి లోపల పూజారులూ, యాత్రీకులూ వుండేందుకుగాను యిరవై నాలుగు గదులుగల యిళ్ళున్నాయి. ఈ కట్టడపు నిరాడంబరమైన కఠినశైలి యాత్రీకులు ఎందునిమిత్తమైతే యిక్కడికి వస్తారో—మూలలలోని రాతి చిమ్నీలనుండి వెలువడే జ్వాలల సహజ సౌందర్యానికి ఉచితంగా వుంది.



బెరెజిన్ పరిశీలనలు చాలా కుతూహలాన్ని కలిగించాయి. ఆ దేవాలయంలో వుండే వారితో అతని తొలి పరిచయం గొప్ప ఆశ్చర్యకరమైన విషయాలను బయటపెట్టింది.

## పార్శీలు కారు !

ఈ దేవాలయ నివాసులూ, యాత్రీకులూ కూడా భారతీయులే. తాము భారత దేశంలోని ఏ భాగానికి చెందినవారో, వారిలో చాలామంది చెప్పేవారు. పార్శీలకూ, తమకూ ఎటువంటి సంబంధమూ లేదని వాళ్ళంతా అన్నారు. వాళ్లు సన్యాసుల్లాగా జీవించారు. వారు చాలా మితముగా ఆహారాన్ని భుజించేవారు. ఆ గదుల్లోని గోడలపైనుండి బెరెజిన్, అనేక చేతులతో వున్న కాళికాదేవి పచ్చని చిత్రాన్ని తిరిగి వ్రాసుకున్నారు. అంత్యక్రియలు యీ పండితుని దృష్టి నాకర్షించాయి. పవిత్రాగ్నిలో మృతుడు దహింపబడ్డాడు. దేవాలయానికి చేరువలో బాగా గ్యాసుగల ఒక గోతిలో, యిందు నిమిత్తం రాతితో ఒక పొయ్యి నిర్మింపబడింది. మృతునికి ఆవుపాలనుండి తీయబడిన వెన్నపూయబడిన తరవాత దహనం జరిగేది. ఈ దేవాలయ భక్తులు, భారత దేశం నుండి ఉత్తమ కుల సంజాతుల అవశేషాలు దహన సంస్కారం నిమిత్తం సురఖనీకి పలుసార్లు పంపబడేవని చెప్పారు. తరవాత చితాభస్మం భారత దేశానికి పంపబడేది.

దేవాలయపు గోడలమీదా, గదుల మీద తనకు కనిపించిన వ్రాతలగురించి కూడా బెరెజిన్ పేర్కొన్నారు. వాటిని సంస్కృతాక్షరాలుగా ఆయన భావించారు. కాని కొన్ని ప్రార్ధనలు మాత్రమే సంస్కృతంలో వున్నవనీ, మిగిలినవి చాలా నూతన భారతీయ భాషలలో వున్నవనీ తరవాత తెలిసింది.

ఈ రష్యన్ పండితుడు చాలా విషయాలను వెలుగులోనికి తీసుకరాగలిగారు: ముఖ్యంగా యీ దేవాలయం పార్శీల, లేదా హీబ్రూల పుణ్యస్థలం అని అందరూ అనుకునే నమ్మకం తప్పని ఆయన నిరూపించారు. అయినా ముఖ్యకృషి ముందుకు జరగవలసి వుంది.

## దేవాలయంలో దొరకిన పత్రాలు

సుమారు ఒక శతాబ్దంగా యీ దేవాలయం రష్యన్ పండితుల దృష్టిని ఆకర్షిస్తూనే వుంది. బెరెజిన్ తరవాత వెంటనే ప్రసిద్ధ ప్రాచ్య విద్యాధ్యయనవేత్త దోర్న్ అక్కడికి వెళ్ళారు. ఆయన ఒక భక్తుని దగ్గరనుండి, మహాభారత పాఠాలనూ, చాలా ప్రార్థనలనూ—సుదీర్ఘమైన లిఖిత పత్రాలను సంపాదించగలిగారు. దేవాలయ చరిత్రకు సంబంధించిన అనేక కొత్త రచనలు 1900 సం లోనూ, 1920 లోనూ వెలువడ్డాయి ఈ వ్రాతలను అనువదించడానికి ప్రయత్నాలు జరిగాయి.

భారత దేశంలోని అజర్‌బైజాన్ పండి

తుల విజ్ఞప్తిపైని భారత దేశపు పురావస్తుశాఖ డైరెక్టర్ జనరల్ కార్యాలయాల్లో యీ వ్రాతలు అనువదింపబడి, 1938లో అజర్‌బైజాన్‌కు పంపబడ్డాయి.

సోవియట్ భారతీయ విద్యాధ్యయనవేత్త ఒరొన్యోవ్-దెస్యతోవ్‌స్కీ యిటీవలనే ఇంకా చాలా రచనలను అనువదించి ప్రచురించారు. ఇవి దానపత్రాలూ, అధికార పత్రాలూ. కొన్ని గురుముఖిలోనూ, కొన్ని దేవనాగరిలోనూ వ్రాయబడినవి. వాటిలో అన్నిటికంటె పూర్వపుది 18వ శతాబ్దారంభంలో వ్రాసినది, అన్నిటికంటె కొత్తది 19వ శతాబ్దపు ఉత్తరార్ధంలో వ్రాసినది. అయినా వాటిలో కొన్నిటి విషయాలు అర్థం కావడంలేదు. గురుముఖిలో వ్రాసిన వాటిలో సిక్కుల తొలి ప్రార్థన "జాప్‌జీ" వుంది. దేవనాగరి రచనలలో గణేశుడు మొదలైన వారిగురించి వుంది. వివిధ మతశాఖలకూ, ధోరణులకూ చెందిన వారూ యీ దేవాలయాన్ని పుణ్యస్థలంగా పరిగణించే వారని దీనినిబట్టి తెలుసుకోవచ్చును ఇంతే కాకుండా, యీ వ్రాతలనుబట్టి, వ్యాసాలను బట్టి యీ దేవాలయ చరిత్రను స్థూలంగా గ్రహించవచ్చును.

## దేవాలయ చరిత్ర

పదహారవ శతాబ్దంలో ట్రాన్స్ కకాసస్ దేశాలకూ, భారత దేశానికీ మధ్య వాణిజ్యం అభివృద్ధి చెందిందని తెలిసిన విషయమే. భారత దేశం నుండి వర్తకులు, చేతివృత్తులకు చెందినవారూ, అజర్‌బైజాన్లోని షెమఖ్, బాకూ మొదలైన నగరాలకు ఎక్కువగా రాసాగారు. అగ్నిని దైవంగా భావించి, పూజించడం అప్షెరాన్ ద్వీపకల్పంలో మొదలవడం వీరితోనే జరిగినట్టుగా కనిపిస్తోంది. 1683లో భారతీయులు, సురఖనీవద్ద గోడలను సరిపోలే కొన్ని కట్టడాలను కట్టారు. ఈ జ్వాలలను గురించి యింకా ఎక్కువగా తెలిసినకొద్దీ, భారత దేశంనుండి ఎక్కువగా యాత్రికులు వచ్చారు. తరవాత చాలామంది భక్తులూ, సన్యాసులూ వచ్చి యీ పవిత్ర జ్వాలలవద్ద శాశ్వతంగా స్థిరపడి పోయారు. వీరేకాకుండా బాకూలోనూ, యితర అజర్‌బైజాన్ నగరాలలోనూ గల భారతీయులు కూడా యీమత కర్మకాండలలో పాల్గొన్నారు. చేతివృత్తులకు చెందిన భారతీయులు 18వ శతాబ్దంలో దేవాలయానికి ప్రక్కగా వుంటూ వుండేవారు. మొట్టమొదటి వ్రాతనే (1713) వడ్రంగి తారాచంద్రుడనే అతను తయారు చేశాడు. 17వ శతాబ్దాంతంలోనూ, 18వ శతాబ్ద ప్రారంభంలోనూ యీ దేవాలయము యిప్పుడున్న విధంగా పునర్నిర్మింపబడినట్టుగా కనిపిస్తోంది. వివిధ దశలలో భక్తుల సంఖ్య హెచ్చడమూ, తగ్గడమూ జరుగుతూవుండేది. 18వ శతాబ్దంలోనూ, 19వ శతాబ్దం తొలి అర్ధ భాగంలోనూ సుమారు అరవై నుండి డెబ్బయి వరకూ కర్మకాండలలో పాల్గొనేవారు. భారత దేశంనుండి వచ్చిన బ్రాహ్మణులు వీటిని సాధారణంగా జరిపేవారు. 19వ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో భక్తులసంఖ్య బాగా పడిపోవడం మొదలైంది. రష్యన్ చక్రవర్తి రెండవ అలెగ్జాండర్ సమ్ముఖంలో, 1850లో పెద్దగా చేయబడిన ఆఖరు ఉత్సవం జరుపబడింది. 1830 సరికి, హిందూ బ్రాహ్మణులలో చివరివ్యక్తి, ఒంటరితనం భరించలేక దేవాలయాన్ని వదిలి వెళ్ళిపోయారు.

## ఇంకా చాలా పరిశోధించాలి

ఈ దేవాలయం గురించి తెలుసుకోవలసినది యింకా చాలా వుంది. వ్రాతలన్నీ అనువదింపబడలేదు. అగ్నిపూజా విధానం గురించి, భారత దేశపు మతాలతో దానికిగల సంబంధం గురించి పూర్తిగా నిరూపణ జరగలేదు. సోవియట్ పండితులూ, వారి భారతీయ మిత్రులూ యింకా పరిశోధనను సాగించినట్లయితే, యీ ఉభయ మిత్రప్రజల చరిత్రలోని యీ చక్కని ఘట్టం పూర్తిగా సుస్పష్టం కావడానికి యిది నిస్సందేహంగా సహాయకారి అవుతుంది.





# తతారియా కళలు

ఐ. వెర్షినినా



తతారియా, రష్యన్ సమాఖ్యలోపలి ఒక చిన్న స్వపరిపాలక రిపబ్లిక్కు, ఒల్గా నది మధ్య ప్రాంతాల వెంబడిని యిది వుంది. గొప్ప ధాన్యం పంటలకూ, పశుపోషణకూ. విలువైన ఉన్నితో వున్న జంతువులు గల విశాలమైన అడవులకూ, యీ ప్రాంతం శతాబ్దాలుగా పేరుపడింది.

సోవియట్ పరిపాలనా కాలంలో తతారియా పెద్ద స్థాయిని పరిశ్రమలను నిర్మించుకుంది. దానికి చాలా యింజినీరింగ్ పరిశ్రమలూ, బట్టల మిల్లులూ. చర్మం ఫాక్టరీలూ వున్నాయి. యుద్ధం తరవాత తతారియాలో పెద్ద నూనె గనులు త్రవ్వబడ్డాయి. అందువల్ల యిప్పుడీ రిపబ్లిక్కు నూనె ఉత్పత్తిలో, ప్రపంచంలోని పెద్ద నూనె గనులలో ఒకటైన బాకూ కంటె ముందంజవేసింది.

విప్లవానికి ముందర తతారియా రష్యాలోని చాలా వెనుకబడిన ప్రాంతాలలో ఒకటిగా వుండేది. ఈనాడది పదకొండు ఉన్నత పాఠశాలలతోనూ.పద్నాలుగు వేలకు పైగా ప్రాథమిక, సెకండరీ పాఠశాలలతోనూ, వందల కొలది నాటకశాలలతోనూ, సంస్కృతీ భవనాలూ, క్లబ్బులతోనూ ఒక ముఖ్య సాంస్కృతిక కేంద్రంగా వుంది.

ఇటీవల మాస్కోలో జరిగిన తతార్ కళా సారస్వత దశ దినోత్సవం గురించి, యీ దిగువ మీకు సంక్షిప్తంగా తెలియజేస్తాము. సోవియట్ రిపబ్లిక్కుల సాంస్కృతిక విజయాలు సమీక్షింపబడే యిటువంటి ఉత్సవాలు సోవియట్ దేశంలో సాంప్రదాయమైపోయాయి.

తతార్ కళా దశదినోత్సవంలో పాల్గొనేవారు మాస్కోకు చేరడానికి చాలారోజులు ముందుగానే, తతార్ ప్రదర్శనలకు టిక్కెట్లు అమ్ముడయి పోయాయి.

ఈ ఉత్సవంకొరకు మాస్కోకు నాలుగు సమాజాలు వచ్చాయి. తతారియాలో యింకా ఎన్నో సమాజాలున్నాయి. ఈ రిపబ్లిక్కు ముఖ్య పట్టణమైన కజాన్‌లోనే ఐదు నాటక సమాజాలున్నాయి. కాని

తాతార్ గేయ నృత్య నాటకశాల

యీ నాలుగు సమాజాలూ ఉత్తమమైనవి. తతార్ కళలో యెంత వైవిధ్యం వున్నదీ, అది యెంత అహ్లాదకరమైనదీ తెలుసుకోవడానికి యివి మాస్కో పురవాసులకు అవకాశాన్ని చ్చాయి.

జలీల్ గేయ, నృత్యనాటక సమాజం చేసిన ప్రదర్శనలను మాస్కో ప్రజలు చాలాకాలం జ్ఞాపకం వుంచుకుంటారు. సమాజం 1939 లో స్థాపింపబడింది; మాస్కో సంగీత విద్యాలయ పట్టభద్రులైన తతార్ యువజనులు, దాని సభ్యులు. తతార్ గాన సాంప్రదాయాన్ని రష్యా గాత్ర సంగీత సూత్రాలతో జోడించి, వారు ప్రథమ తతార్ సంగీత నాటకాన్ని సృష్టించారు. నేడు యీ నాటక సమాజం "ఆల్తి న్చచ్", "జలీల్" వంటి శుద్ధ తతార్ గేయ నాటకాలనూ, యూరోపియన్, రష్యా ప్రాచీన గేయ నాటకాలనూకూడా జయప్రదంగా ప్రదర్శిస్తోంది.

ఈ సంవత్సరం కమాల్ ప్రభుత్వ నాటక సమాజం తన 50వ జన్మదినోత్సవాన్ని జరుపుకుంటుంది. విప్లవానికి ముందరవున్న తతార్ నాటక సమాజం యిదొక్కటే.

ఇంచుమించుగా ఎప్పుడూ ప్రయాణాల్లో



రష్యన్ రిపబ్లిక్కు గౌరవ కళావేత్త యన్. కె. దౌలోవ్, మూసా జలీల్ అన్న గేయ నాటకంలో అదే పాత్రలో నున్న దృశ్యం



గ్రామ వినియోగదారుల సహకార సంఘ సభ్యురాలు దనియా అబ్దురఖమోనోవా (రొట్టెల పనికత్తె), నికొలాయ్ బైకోవ్ (డెలివరీ చేసే మనిషి) ఒక జాతీయ నృత్యం చేస్తోన్న దృశ్యం

వుండే మెన్జెలిన్స్క్ సంచార నాటక సమాజం, మాస్కో పురవాసులలో చాలా కుతూహలాన్ని రేకెత్తించింది. నాటక శాలలు లేని చిన్న నగరాలలోనూ, గ్రామాలలోనూ యీ సమాజ నటులు ప్రదర్శనలిస్తుంటారు.

## వృత్తి నటులు కారు

ఈ నాలుగు నాటకసమాజాల్లోనూ ఒకటి, కిరోవ్ జిల్లాలోని కజాన్‌కు చెందిన ఒక అమెచ్యూర్ నాటక సమాజం. నాటకాభిమానులైన కొందరు ఫ్యాక్టరీ కార్మికులు 1918 లో మొదట యీ సమాజాన్ని స్థాపించారు. ఇప్పుడది కిరోవ్ జిల్లా సాంస్కృతిక జీవితానికి కేంద్రంగా వుంది. ఈ ఔత్సాహిక బృందంకోసం ప్రభుత్వం ఒక పెద్ద నాటకశాలను నిర్మించింది. ఇది ఏవృత్తి నట బృందమైనా చూసి అసూయ

(మిగత 37వ పుటలో)



# "ప్రపంచపు పైకప్పు"

స్టానాబాద్-ఖోరోగ్ మానం బయలుదేరి పైపైకి లేస్తుంటే మా అందరికీ కాస్త గాభరా ఎత్తినమాట నిజమే. వసంత కాలంలో పామీర్లలో విమానయాత్ర ప్రమాదకరమైనదని—వాతావరణం మారి మేము వారాలతరబడి కదలలేకుండా వుండిపోవచ్చు—మా స్నేహితులు చేసిన హెచ్చరిక మాకు జ్ఞాపకం వచ్చింది.

పామీర్లు, ఒక పర్వతాల బారు. సోవియట్ దేశంలో వీటిని "ప్రపంచపు పైకప్పు" అని అంటారు. ఇది యించుమించు అరవై వేల చదరపు కిలోమీటర్ల ప్రదేశం. సముద్రపు మట్టానికి 2,500 నుండి 7,000 మీటర్లవరకూ ఎత్తున యివి వున్నాయి. ఇవి శతాబ్దాలుగా మిగతా ప్రపంచంతో యించుమించు సంబంధం లేకుండా పడివున్నాయి.



సముద్రం మట్టానికి 6,000మీటర్ల ఎత్తున ఆక్సిజన్ మాస్కులు పెట్టుకొమ్మని స్టీవర్డ్ మాకు సలహా యిచ్చాడు. విమానానికి యిరు వేపులా మంచు కప్పివున్న పర్వత శిఖరాల బారులున్నాయి. దిగువ ఎక్కడో స్టాలినాబాద్-ఖోరోగ్ రహదారి వుంది. శీతకాలంలోనూ, వసంతంలోనూ యిది దుర్గమంగా వుంటుంది. మోటారుకార్లకే కాకుండా, యీ కష్టమైన కొండదారులకు అలవాటు పడిన గుర్రాలకు కూడా. ఈ కాలాల్లో పామీర్ల లోపలికి వెళ్ళడానికి ఏకైక సాధనం, విమానం మాత్రమే. మోటారుకార్లు, విమానాలూ అక్కడికి యిటీవల ఏళ్లలో మాత్రమే వచ్చాయి. మొదటి మోటారుకారు అక్కడ ముప్ఫయ్యేళ్ళ క్రితం కనిపించింది, ఒకసంవత్సరం తరవాత మొదటి విమానం వచ్చింది.

## ఖోరోగ్, తొలి అనుభవాలు

విమానాశ్రయంనుండి నగరానికి కొద్దినిమిషాల్లో చేరవచ్చును. ఖోరోగ్ రాజవీధికి ఒక వేపున పోప్లార్ చెట్లున్నాయి; యింకో వేపున గుంత్ నది శీఘ్రగమనంతో ప్రవహిస్తుంది. ఖోరోగ్ చిన్న నగరం, అందుచేత చూడవలసినవి చూడడానికి మాకు అట్టేకాలం పట్టలేదు. పల్లపు ప్రదేశాలలో వుండేవారికి వింతగా కనిపించే యీ దృశ్యానికి అలవాటు పడడానికి, కాస్త ఎక్కువకాలం పడుతుంది. రెండు కొండల వల్ల ఏర్పడిన లోతయిన సన్నని లోయలో వుంది నగరం. ఈ కొండల ప్రక్కలకు చిన్న చిన్న యిళ్లున్నాయి. సమానాంతరంగా వున్న ఒకే ఒక వీధి ఖోరోగ్‌లో యీ లోయ దిగువగా పోతుంది.

పామీర్ ప్రజలు చాలా అందమైనవాళ్లు. వారిలో సగంమంది ముఖాలు చిత్రిస్తే బాగుండుననిపిస్తుంది.

మాకీ ప్రదేశాలను చూపెట్టే దర్శకుడు పామీర్లలో నివసించే ఒదీనా ఇస్మయిలోవ్. ఔత్సాహిక కళాకార్యకలాపాలకు నాయకులలో యీయన ఒకరు. అందువల్ల సహజంగా మేము పామీర్లలో మా తొలి సాయంకాలాన్ని నాటకశాలలో గడిపాము. అవును నమ్మ శక్యంకాదుగాని, ఖోరోగ్‌లో మొదటి పాఠశాల ముప్ఫయ్యేళ్ళ క్రితం

---

పడమర పామీర్లలోని గుంత్ నదిపైనున్న వంతెన



మాత్రమే మొదలైనా, యీ నగరంలో ఒక వృత్తి నాటక సమాజం యిరవై యేళ్ళుగా వుంది.

## కళ, ధైర్యమూ

మేము నాటకశాలలో పామీర్ రచయిత మిర్షాకర్ వ్రాసిన నాటకం "బంగారు కిష్లక్" అన్న దానిని చూశాము. దాని కథ యీ విధంగా వుంటుంది: ఇద్దరు యువకులు కొండలపైనున్న తమ దరిద్రపు కిష్లక్‌ను (గ్రామం) వదిలిపెట్టి, బ్రతుకు తెరువుకోసం బయలుదేరుతారు. అందరూ సుఖంగా జీవించే దేశానికి వెళ్ళాలని వాళ్ళు బయలుదేరుతారు. "బంగారు గ్రామం" కోసం వెతుకుతూ వీళ్ళిద్దరూ చాలా కష్టాలు పడతారు. కాని అది వాళ్ళకు కనిపించదు. అంచేత వాళ్ళు తిరిగీ యింటికివస్తారు. నూతనసోవియట్ పామీర్లలో వాళ్ళింతకాలమూ వెతుకుతూ వున్నది కనిపిస్తుంది.

నటులు చెప్తోన్న దానిలో చాలా భాగం మాకు బోధపడలేదు. కాని వారి నటన మాకు బాగా నచ్చింది.

ఖొరోగ్ నాటక సమాజం చాలా కష్టపరిస్థితులలో నడుస్తోంది. వేసవిలో అది ఖొరోగ్‌లో ప్రదర్శనలను యిస్తుంది. యిరుగుపొరుగు గ్రామాలనుండి వాటిని చూడడానికి అక్కడికి ప్రజలు వస్తారు. కొండ గ్రామాలు మంచుతో కప్పివుండే శీతకాలంలో యీ నాటక సమాజం పర్యటనకు వెళ్తుంది. దారులవెంబడిని కార్లుగాని గుర్రాలుగాని వెళ్ళ లేవుగనక, నటులు కాలినడకను బయలుదేరతారు. సెట్లూ, దుస్తులూ తమ వీపులపైని మోసుకుని. కొన్నికొన్నిచోట్ల వారు తాటి నిచ్చెనల పైని కొండ కొనలమీదుగా వెళ్ళవలసి వుంటుంది "ఖొరోగ్‌లోనే మేము వుండిపోగలమనుకోండి. కాని గ్రామస్తులకు సంవత్సరంలో సగానికిపైగా వినోదం ఏమీ వుండదు. అందుచేత మేము తిరుగుతాము. మేము క్రొవ్వెక్కకుండా యిది అవుతుంది" అంటూ నవ్వాడు వాగ్గేయకారుడూ, యీ నాటక సమాజపు ప్రముఖ నటులలో ఒకరూ అయిన కుర్బన్‌స్పినోవ్. మేము ప్రశంసా భావంతో పరవశులమై వుండడంవల్ల, ఆయన నవ్వులో మేము చేరలేకపోయాము.

## బొటానికల్ గార్డెన్స్

సుఖమైన హోటలులో రాత్రి బాగా విశ్రాంతి తీసుకున్నాక (కొద్ది సంవత్సరాల క్రితం వరకూ హోటలు అన్నది ఊహకందని విషయం), మాకు విశేషాలు చూపెట్టే అతనితోబాటుగా మేము కారులో బయలుదేరాము. మేము ఎక్కడికి పోతున్నామో మాకు తెలియదు. ఒదీనా మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచెత్తుదామనుకున్నాడు.

ఖొరోగ్ నగరంలోని అక్టోబరు 20 వీధి



మా విలేకరి

**వ్సెలోద్ రొమనోవ్**

మేమొక పెద్ద ఆర్చిని సమీపించాము. దానికి వెనుక రెండంతస్తుల గృహం ఒకటి. తీర్చిదిద్దిన బాటలలో చెట్లూ, పొదలూ వున్నాయి. "బొటానికల్ గార్డెన్స్" అని అందరమూ ఏకకంఠంతో అన్నాము. మేము ఆశ్చర్యపడలేదు. ఒదీనాకు ఆశాభంగమైంది. ఖొరోగ్ బొటానికల్ గార్డెన్స్ సోవియట్ దేశం అంతటా ప్రసిద్ధిని పొందడం అతని తప్పేమీకాదు.

ఈ తోటలో పనిచేసే ఒక పామీరు వృక్ష శాస్త్రజ్ఞుడు యుసుఫ్ బెక్ ఖదయెవ్‌తో మా సంభాషణ వివరించదగ్గది. విప్లవానికి ముందర భాగ్యవంతుల యిళ్ళల్లోకూడా పొంగిన రొట్టె నూడిదగా పరిగణింపబడేది. మనిషి ఒక్కంటికీ సాగుక్రింద నున్నది ఒక పావు ఎకరం భూమి వుండేది. ఈ భూమి పండించేది బహుకొద్ది. ఇప్పుడు యీ సంఖ్య ఒక ఎకరానికి పెంచబడింది. కాని ముఖ్య విషయ మేమిటంటే యిటీవలి సంవత్సరాలలో విజ్ఞానశాస్త్ర పరిశోధన క్రొత్త రకాల గోధుమనూ, రైధాన్యాన్నీ, చిక్కుడు గింజలనూ తయారు చేసింది. ఇవి బయళ్ళలోకంటె కొండలలో యెక్కువ పంటలను యిస్తాయి.

లేకపోతే ఉదాహరణకు బంగాళా దుంపలను తీసుకోండి కొద్ది ఏళ్ళక్రితం యివి పామీర్ల ప్రజలకు తెలియవు. కాని యిప్పుడు పామీర్లలోని బంగాళా దుంపలు స్టాలినాబాద్‌కు రవాణా చేయబడుతున్నాయి. హెక్టారుకు 8.4 టన్నుల పంట యిటీవలనే పండింపబడింది బొటానికల్ గార్డెన్స్‌లో 35 రకాల ఆపిల్స్, 20 రకాల ఆప్రికాట్లు, తొమ్మిదిరకాల పియర్ పళ్ళూ తయారు చేయబడ్డాయి. తూర్పు పామీర్లలోని ఒక జీవశాస్త్ర కేంద్రం (యిది సముద్ర మట్టా







నికి 3,900 మీటర్ల ఎత్తున వుంది). పూర్వం పూర్తిగా గొడ్డు భూములుగా వుండే చోట్లలో బార్లీనీ, ఓట్లనూ ప్రవేశ పెట్టింది.

## "బంగారు గ్రామం"

మేము మర్నాడు వెళ్ళిన స్టాలిన్ సమిష్టి క్షేత్రం అధ్యక్షుడు మామద్‌బెక్ కొజ్నజరోవ్ మాకిలా చెప్పారు: "ఇరవై ఏళ్ళ క్రితం మా సమిష్టిక్షేత్రానికి 100 హెక్టార్ల సేద్య యోగ్యమైన భూమి మాత్రం వుండేది. ఈ భూమిని యింకా పెంచడానికి అనేక దస్తాల రాళ్ళను మేము తీసివేశాము (కొండ పల్లంలోని పురాతన నదీ తలం, దస్తా). ఇందుకు సంవత్సరాలపాటు కష్టపడి పనిచెయ్యవలసి వచ్చింది. తరవాత మేమొక కొత్త కాలువను తవ్వాము. ఇక్కడ కాలువను త్రవ్వడము — యిక్కడ మేము రాతిని మందుపెట్టి పేల్చవలసి వచ్చింది — బయళ్ళలో చేసినట్టుగా తేలికైన పనేమీ కాదు. ఇప్పుడు మాకు 240 హెక్టార్ల నీటి వనరులు గల సారవంతమైన భూమివుంది."

ఈ సమిష్టి క్షేత్రం పశుపోషణ, ధాన్యం పంట పట్టుపురుగుల పెంపకం సాగిస్తుంది. దీనికి ఐదువేల గొర్రెలు, అనేక వందల ఆవులు, పెద్ద కోళ్ళు వగైరా మందలూ, పందులూ వున్నాయి. గోధుమ, రై, మొక్కజొన్న యిక్కడ పండే ధాన్యాలు. పట్టు పురుగుల పెంపకంవల్ల సాలుకు ఐదులక్షల రూబుళ్ళకు పైగా వస్తుంది.

మేము అధ్యక్షునితో అతని కార్యాలయంలో మాటాడుతూ వుంటే సమిష్టి రైతులు రాసాగేరు. వారిలో చాలామందికి మేము పరిచయం చేయబడ్డాము ఉదాహరణకు నజలీ ఉస్తలీవ్ తానూ, తన భార్య, పెద్దవాడైన తన కొడుకు గల తన కుటుంబం, గత ఏడాది సుమారు పన్నెండు వేల రూబుళ్ళ రొక్కాన్ని, 1200 కిలో గ్రాముల గోధుమనూ, అనేక డజన్ల కిలోగ్రాముల మాంసాన్ని, వెన్ననూ గడించిందని మాకు చెప్పాడు. "ఇంకా సుమారు రెండేళ్ళలో ఒకొక్క పని రోజుకూ మాకు యింకా యెక్కువగా డబ్బు, ధాన్యం వస్తాయి"

పైచిత్రం:

రచయిత మిర్జాకర్ రచించిన "బంగారుగ్రామం" అన్న నాటక దృశ్యం. ఖారోగ్ సంగీత నాటక సమాజం ప్రదర్శించినది.

దిగువ:

వాగ్గేయకారుడు కుర్బన్ స్మినోవ్ తజిక్ రిపబ్లిక్కు గౌరవనీయ కళావేత్త్రి అలిఫ్ చెకోవా గానం చేస్తోన్న దృశ్యం.

అని ఆయన అన్నాడు. రెండేళ్ళలో యింకో కొత్త కాలువనిర్మాణం పూర్తి అవుతుందనీ, అందువల్ల సమిష్టిరైతులు యింకా అనేక డజన్ల హెక్టార్లు ఎక్కువగా యిరిగేటెడ్ భూమిని సాగు చేయ గలుగుతారనీ మాకు తెలిసింది. క్షేత్రం ఎక్కువ భూమిని సాగుచేస్తోన్న కొద్దీ, దాని ఆదాయం ఎక్కువ అవుతూ వుంటుంది.

దృశమైన క్షేత్రగృహాలను, ఏడు లారీలతో గారేజ్‌నీ, కొత్త క్లబ్బునూ చూశాక ప్రకృతి దృశ్యం మా తిరుగు ప్రయాణంలో ఏమంత విషాదంగానూ, అగమ్యంగానూ కనిపించలేదు. మనిషి, తన పరిసరాలకంటె బలవత్తరుడు; అగమ్యమైన యీ కొండలకూ, రాళ్ళకూ ప్రభువు.

## చివరి సాయంత్రం

ఖోరోగ్‌లో అదే మా ఆఖరు సాయంత్రం. చీకటి పడుతూ వున్నకొద్దీ నగరం వున్న లోయలో విద్యుద్దీపాలు మినుకు మినుకుమని వెలగడం మొదలైంది. సందె చీకట్లతో జీవితం ఆగిపోదు, పూర్వం జరిగినట్టుగా. ఖోరోగ్‌లో ప్రచురింపబడే రెండు వార్తా పత్రికల మర్నాటి సంచికలను ముద్రణాలయం ముద్రిస్తోంది. నగర వైద్యశాలలో పనిలోవున్న డాక్టరు తన పనిలో తిరుగుతున్నాడు. సినీమా హాలులో ఒక ఫిల్మ్ చూపబడుతోంది. ఇళ్ళలో బడిపిల్లలూ, కళాశాలా విద్యార్థులు, చాలా మంది వయోజనులూ తమ పుస్తకాలు పట్టుకకూచున్నారు. పామీర్లలో యీ రోజుల్లో ఐదుగురిలో ఒకరు చదువు కుంటున్నారు. ఈ మండలంలో 200 పాఠశాలలున్నాయి. వాటిలో అనేకం వయోజనులవి. ఒక ఉపాధ్యాయినీ శిక్షణాలయమూ, ఉపాధ్యాయులకు ఉన్నత శిక్షణనిచ్చే సంస్థ వున్నాయి. ఖోరోగ్‌లోని 85 వేల గ్రంథాలు గల గ్రంథాలయంతోబాటుగా 76 గ్రంథాలయాలు సరిపోవడంలేదు. సౌభాగ్యంతోబాటుగా సంస్కృతి పామీర్లకు వచ్చింది. అక్కడివారు పెద్ద గోధుమ పంటలను పండించడమూ, మోటార్లను నడపడమూ మాత్రమే కాదు. వారు టాగూరు, పుష్కిన్, మార్క్స్, హెగెల్ గ్రంథాలను చదువుతున్నారు కూడా.

ఒక నెల్లాళ్ళపాటు యీ "కూపం"లో చిక్కుపడిపోతానేమో అని నాకు కలిగిన భయాన్ని తలుచుకుని నవ్వుకున్నాను. నా తలమీది ఆకాశాన్ని చూస్తే, మర్నాడు వాతావరణం వల్ల మేము బయలుదేరడానికి వీలు కలుగకపోయినా పరవాలేదులే అని అనుకున్నాను.

మాస్కో—ఖోరోగ



పైన: ఖోరోగ్ బొటానికల్ గార్డెన్స్‌లోని యూరోపియన్ తరుమండలంలో విజ్ఞాన శాస్త్రజ్ఞుడు

☆

మధ్య: పామీర్ బాలిక

☆

దిగువ: ఖోరోగ్‌లోని ఉపాధ్యాయినీ శిక్షణాలయంలో



# పాఠకుల ప్రశ్నలకు మా జవాబులు

## ప్రశ్న: సోవియట్ దేశంలో కార్మికుల వేతనాలు ఏ విధంగా వుంటాయి?

*శ్రీ జనపరెడ్డి, శ్రీ గోపాలకృష్ణ (విశాఖ పట్టణం) మొదలైనవారు.*

జవాబు: సోవియట్ కార్మికుల వేతనాలు పరిశ్రమను బట్టి, పని పరిస్థితులనుబట్టి వుంటాయి. భూగర్భంలో పనిచేసే గని కార్మికులకు అందరికంటె ఎక్కువగా వేతనాలు చెల్లింపబడతాయి (బొగ్గు, ముడి లోహం త్రవ్వకం మొదలైనవి). నేర్పునుబట్టి వారి వేతనాలు సగటున నెలకు 15 వందల రూబుళ్ళనుండి మూడు వేల రూబుళ్ళ వరకూ వుంటాయి లోహ, యింజినీరింగ్ పరిశ్రమలలో వేడిగా వుండే శాఖలలో పనిచేసే కార్మికుల వేతనాలు నెలకు వెయ్యినుండి రెండువేల ఐదువందల రూబుళ్ళవరకూ వుంటాయి. పని పరిస్థితులు తేలికగా వుండే లఘు పరిశ్రమలలోనూ, ఆహార పరిశ్రమలలోనూ కార్మికుల వేతనాలు నెలకు 500 నుండి 1300 రూబుళ్ళవరకూ వుంటాయి. చాలా నిపుణులైన కార్మికులు మాత్రమే యింతకంటె యెక్కువ వేతనాలను గడిస్తారు.

ఫ్యాక్టరీ కార్మికులకూ, కార్యాలయోద్యోగులకూ వేతనాలను యింకా పెంచేందుకు సోవియట్ ప్రభుత్వం యిప్పుడు చర్యలను తీసుకుంటోంది. తక్కువజీతాల తరగతులలోని ఫ్యాక్టరీ కార్మికుల, కార్యాలయోద్యోగుల వేతనాలు 1957 జనవరి 1 వ తేదీకి వున్నదానిని బట్టి సగటున నూటికి 33 వంతులు పెంచబడ్డాయి. ఆరవ పంచవర్ష ప్రణాళిక, 1960 సరికి యదార్థ వేతనాలలో నూటికి 30 వంతులు పెంచడానికి నిర్ణయించింది.

## ప్రశ్న: సోవియట్ కార్మికుల పనికి కాలాన్ని బట్టా, లేదా పని మొత్తాన్నిబట్టా (పీస్-రేట్) చెల్లిస్తారు?

*శ్రీ షామస్ జమాల్, మియాన్‌పూర్ (బీహార్)*

జవాబు: సోవియట్ కార్మికులలో అత్యధిక సంఖ్య కార్మికులకు చేసిన పని మొత్తాన్నిబట్టి చెల్లిస్తారు. ఈ పద్ధతిలో కార్మికుని ఆదాయం, పని కోటాను నెరవేర్చడాన్నిబట్టి ఆధారపడి వుంటుంది. పీస్-రేట్ బోనస్ పద్ధతికూడా వుంది. దీని ప్రకారం పనిమొత్తాన్ని బట్టి కార్మికులకు చెల్లించడంతో బాటుగా, పనిలో ఒక నిర్దిష్ట విషయాన్ని నెరవేర్చినందుకుగాను బోనసు యిస్తారు.

పీస్-రేట్ పద్ధతి శ్రమ ఉత్పాదన శక్తిని బాగా పెంపొందించి, కార్మికుల వ్యక్తిగత ప్రయోజనాలను, యావత్తు దేశపు ప్రయోజనాలతో సంపూర్ణంగా సమన్వయ పరచడానికి సహాయ పడుతుంది. కాల పరిమితిని బట్టి జీతాలను చెల్లించేపద్ధతి, పని ప్రత్యక్ష ఫలితాలను అంచనా కట్టడం కష్టంగావుండే సందర్భాలలో సోవియట్ దేశంలో అమలు జరుగుతూ వుంటుంది (ఉదాహరణకు ఒక ఎలెక్ట్రీషియన్, లూబ్రికేటర్, పవర్ స్టేషన్ అటెండెంట్ పని).

## ప్రశ్న: సోవియట్ దేశంలో కార్మికులకు తమ వేతనాలుకాక అదనపు అలవెన్సులేవైనా వస్తాయా? వారికి యిళ్ళు యివ్వబడతాయా?

*శ్రీ జనపరెడ్డి, శ్రీ గోపాలకృష్ణ (విశాఖ పట్టణం)*

జవాబు: తమ నెలసరి జీతాలే కాకుండా సోవియట్ దేశంలోని కార్మికులకు వివిధ అలవెన్సులు వస్తాయి: ట్రేడ్‌యూనిన్ నుండిగాని, డైరెక్టర్ నిధినుండిగాని అసాధారణ ధన సహాయం; ఆరోగ్య స్థావరాలలోనూ, సెలవు మందిరాలలోనూ, ఆరోగ్యమందిరాలు మొదలైన వాట్లోనూ ఉచిత వసతులు.

సోవియట్ దేశంలోని పౌరులందరివలెనే కార్మికులు ఉచిత వైద్య సహాయాన్ని అనుభవిస్తారు. వారి పిల్లలు పాఠశాలలలోనూ, సాంకేతిక పాఠశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ, కళాశాలలలోనూ ఉచితంగా చదువుకుంటారు.

పనిలో విజయాలను సాధించినందుకు కార్మికులకు బోనస్సులు యివ్వబడతాయి.

అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ఎంప్లాయ్‌మెంట్‌గాని జిల్లా సోవియట్లుగాని (స్థానిక అధికారులు) కార్మికులకు యిళ్లు యిస్తారు. వారు ఒక నిర్దిష్టమైన అద్దెను, చాలా కొద్ది అద్దెను చెల్లిస్తారు. కార్మికుడు, అతని కుటుంబమూ అతను ఉద్యోగం వదిలిపెట్టిన తరవాతగాని, లేదా యింకెక్కడైనా పనిలో చేరిన తరవాతగాని యింట్లో వుండవచ్చును. కార్మికుడు చనిపోయాక అతని కుటుంబం అతని యింట్లో వుంటుంది.

తమ స్వంతయిళ్ళు కట్టుకోవాలనుకునే కార్మికులకు ప్రభుత్వం దీర్ఘకాల ఋణాలను యిస్తుంది.

(మిగత 37వ పేజీలో)

# నెహ్రూ బుల్గానిన్ ప్రకటన ద్వితీయ వార్షికోత్సవం

సోవియట్ దేశ మంత్రివర్గాధ్యకుడు నికొలాయ్ బుల్గానిన్, భారత దేశ ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ మాస్కో లో చేవ్రాళ్ళు చేసిన సంయుక్త ప్రకటన రెండవ వార్షికోత్సవంలోవి మూల విషయం భారత, సోవియట్ ప్రజల మధ్య వృద్ధి చెందుతోన్న స్నేహం.

భారత దేశం, సోవియట్ దేశాల అనేక సమస్యలకు విస్తృతమైన సమిష్టి జాతీయ ప్రయోజనాలు, యుద్ధానంతర సంవత్సరాలలోని క్లిష్టమైన అంతర్జాతీయ పరిస్థితుల్లో నానాటికి మరింత యెక్కువగా వ్యక్తమవుతున్నాయి. 1955లో సోవియట్-భారతీయ సంబంధాలు ఉన్నతమైన కొత్త స్థాయికి చేరుకున్నాయి. దేశ స్వాతంత్ర్యాన్ని సుసంఘటితం చేసుకోడానికి సమర్థవంతమయిన ఆర్థిక విధానాన్ని నిర్మించేందుకు దూరదృష్టిగల భారత ప్రభుత్వ నాయకులు జరుపుతున్న ప్రయత్నాలపట్ల సోవియట్ ప్రజలు యెంతో సానుభూతిని కలిగి వుంటున్నారు. ఇందుమూలంగానే మన ఉభయ దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు సార్థకంగా పెంపొందించబడుతున్నాయి. విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగ్ రంగాలలో భారత దేశ-సోవియట్ సంబంధాలు క్రమంగా విస్తృతం గావింపబడుతున్నాయి.

## ఎవ్వరికీ హానిని కలిగించదు

భారతీయ-సోవియట్ మైత్రి సుసంఘటితం కావడం, ఇతర దేశాలతో భారత దేశానికీ, సోవియట్ దేశానికీ గల సంబంధాలకు యెన్నడూ హాని కలిగించదు. పాశ్చాత్య దేశాలు యీ విషయంలో ప్రచారం చేస్తున్న కవ్వింపు అపవాదులు ఇతర దేశాలు యీ సంబంధాలను అపనమ్మకంతోను, అనుమానంలోను చూచేటట్టు చేయడానికి ఉద్దేశింపబడ్డాయి.

## గొప్ప చారిత్రాత్మక విజయం

సోవియట్ దేశం, భారత దేశాల ప్రజలమైత్రి ఒక గొప్ప చారిత్రాత్మక విజయం. గత సంవత్సరం దురాక్రమణ శక్తుల చర్యల ద్వారా అంతర్జాతీయ పరిస్థితి తీవ్రతరం అయినప్పుడు యీ మైత్రి యొక్క బలం స్పష్టంగా వ్యక్తమయింది. ప్రశాంత సమయాల్లోనే కాకుండా కఠిన పరీక్షా దినాల్లోగూడా మన ప్రజలు సోదరులని యిది నిరూపిస్తుంది.

మాస్కోలో, 1955లో నికొలాయ్ బుల్గానిన్, జవహర్‌లాల్ నెహ్రూ సంయుక్త ప్రకటనపై సంతకాలు చేస్తూన్న దృశ్యం



# ఇక అమెరికా బ్రిటన్ల వంతు వచ్చింది

"న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షలను నిషేధించండి!" ఈ దృఢవాంఛ వాస్తవంగా అంతర్జాతీయమైంది. ప్రాచ్య ఖండాలలోని ప్రముఖ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, ప్రసిద్ధులు, రాజకీయ వేత్తలు, సామాన్య ప్రజలు న్యూక్లియర్ ప్రేలుళ్ళ ప్రమాదకర ఫలితాలనుండి ప్రపంచం రక్షింపబడాలని దృఢనిశ్చయంతో కోరుతున్నారు.

న్యూక్లియర్ ఆయుధాలుగల మూడురాజ్యాల ప్రభుత్వాలలో, ప్రస్తుతం ఒక్క సోవియట్ ప్రభుత్వం మాత్రమే ప్రపంచ మంతటా ప్రజలను కలవరపెడుతోన్న సమస్యను పరిష్కరించడానికి తన సంసిద్ధతను స్థిరంగా ప్రకటిస్తోంది. సామూహిక మారణాయుధాల సంపూర్ణ, నిర్నిబంధ నిషేధానికీ, వాటి తయారీని ఆపుదల చేయడానికీ, వాటి నిలవలను నిర్మూలించడానికీ సోవియట్ దేశం దృఢంగా, స్థిర చిత్తంతో తన అభిలాషను ప్రకటించింది.

న్యూక్లియర్ ఆయుధాల నిషేధానికి తొలిచర్యగా సోవియట్ దేశం పరమాణు, ఉదజని బాంబుల పాటవ పరీక్షలను వెంటనే ఆపి వెయ్యాలని ప్రతిపాదించింది. న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షల నిషేధం, పరమాణు ఆయుధాల అపరిమితోత్పత్తి పోటీ ఆపుదలకు ఒక ముఖ్యమైన చర్య అవుతుంది. అది లక్షలాదిమంది ప్రజల ఆరోగ్యానికీ, జీవితానికీ తక్షణ ప్రమాదం లేకుండా చేస్తుంది, దేశాల మధ్య విశ్వాసాన్ని బాగా పెంపొందించి, నిర్మల శాంతి శకానికి మానవ జాతిని చేరువగా తీసుకవెళ్తుంది.

కాని పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు, ముఖ్యంగా అమెరికా బ్రిటన్ దేశాలు, అన్ని రకాల సాకులతో, న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షల ఆపుదల గురించి ఒప్పందానికి రాకుండా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నాయన్నది తెలిసిన విషయమే. లండన్లో యిప్పటికే సుమారు మూడు నెలలుగా సమావేశమవుతున్న మిత్రరాజ్యసమితి నిరాయుధీకరణ కమిషన్ ఉపసంఘం కార్యకలాపాలన్నీ దీనినే స్పష్టపరుస్తాయి. రకరకాలుగా కాలవిలంబనాలూ, మాటల మతలబులూ ఉపయోగిస్తూ పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు, న్యూక్లియర్ ఆయుధాల ప్రేలుళ్లను వెంటనే నిషేధించడానికి సంబంధించిన విషయం గురించి చర్చను తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ వుండడం సువిదితమే. తమ్మి తాము సమర్థించుకునేందుకు, యిటువంటి పరీక్షల ఆపుదలపైని అజమాయిషీ లేకుండా యీ సమస్యా పరిష్కారాన్ని సాధించడం అసాధ్యమని వారు ప్రకటిస్తున్నారు.

న్యూక్లియర్ ఆయుధాల పాటవ పరీక్షల సత్వర నిషేధం గురించి ఒక ఒడంబడికకు రావడానికి గల యీ ప్రాథమిక నిరోధాన్ని తొలగించేందుకు, ఉపసంఘంలోని సోవియట్ ప్రతినిధి వి. ఏ. జోరిన్, జూన్ 14న ఒక కొత్త ప్రతిపాదనను చేశారు. పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలన్నీ రెండు మూడేళ్ళపాటు ఆపి వెయ్యబడాలనీ, అంతర్జాతీయ అజమాయిషీ నెలకొల్పబడాలనీ ఆయన ప్రతిపాదించారు.

ఈ కాలంలో పాటవ పరీక్షలను నిషేధించడం, సహజంగా పరమాణు ఆయుధాల అమితాయుధోత్పత్తి పోటీని అరికట్టి పరమాణు, ఉదజని ఆయుధాల సంపూర్ణ నిషేధానికి ఒడంబడికను సాధించేందుకు మార్గాన్ని సుగమం చేస్తుంది. అదేసమయంలో సోవియట్ దేశం, యీ ఒడంబడిక అమలు జరిగిందా లేదా అని తనిఖీ చేసేందుకు ఒక అంతర్జాతీయ సంఘాన్ని నెలకొల్పాలని ప్రతిపాదించింది. ఈ దృష్టితో, సోవియట్ దేశం, అమెరికా, బ్రిటన్ భూభాగాలపైన, పసిఫిక్ మండలంలోనూ, పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలను నిలుపుదల చేయడానికి యీ దేశాల ఒప్పుకోలు అమలు జరిగిందా, లేదా అన్నదానిపైని అజమాయిషీ జరిపేందుకు అజమాయిషీ స్థావరాలు నెలకొల్పబడాలని సూచింపబడింది.

అంతర్జాతీయ సంఘం తన నివేదికలను భద్రతా సమితికీ, మిత్రరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి నివేదించాలి.

"సోవియట్ ప్రభుత్వం పరమాణు, ఉదజని బాంబుల పాటవ పరీక్షలను వెంటనే ఆపివెయ్యడానికి, పరమాణు ఆయుధాలు గల మిగతా రెండు దేశాలూ—అమెరికా, బ్రిటన్లు యిదే బాధ్యతను స్వీకరించిన వెంటనే ఆపివెయ్యడానికి సిద్ధంగా వున్నానని యింతకు ముందరే ప్రకటించింది. కాల విలంబం లేకుండా యీ ఒడంబడిక పైని చేవ్రాలు చేయడానికి మేము సిద్ధంగా వున్నాం. అమెరికా, బ్రిటన్ ప్రభుత్వాల వంతు యిప్పుడు వచ్చింది" అని వి. ఏ. జోరిన్ అన్నారు.

ఈ విధంగా, సోవియట్ దేశపు శాంతియుతమైన కొత్త చొరవ న్యూక్లియర్ ఆయుధ పాటవ పరీక్షలను తాత్కాలికంగా ఆపివెయ్యడానికి ఒడంబడికను సాధించడానికి గల చివరి అడ్డంకులను తొలగిస్తుంది, యిది సకల దేశాల ప్రజల అత్యంత పవిత్ర వాంఛల కనుగుణ్యంగా వుంటుంది. సరిగ్గా ఈ దృక్పథంనుండే ప్రపంచ ప్రజాభిప్రాయం, ఈ చొరవకు విలువకడుతోంది. ఇదేసమయంలో ఉపసంఘంలోని పశ్చిమ దేశాల ప్రతినిధులు, ఈ ప్రతిపాదన వస్తుందని అనుకోకపోవడంవల్ల గాభరాపడ్డారు,

సోవియట్ ప్రతిపాదనలపైని అమెరికా, బ్రిటిష్ పత్రికల తొలి వ్యాఖ్యలు, యీ విషయాన్ని అన్నిటికంటె ఎక్కువగా చూపుతున్నాయి.

సోవియట్ దేశపు శాంతియుతమైన చొరవ, నిరాయుధీకరణ విషయంలో ఎటువంటి నికరమైన చర్యల గురించి వినడానికి సైతం యిష్టపడని అమెరికన్ ప్రధాన సైనిక కార్యాలయవర్గాల్లో ప్రత్యేకంగా గాభరా ఎత్తించింది "న్యూయార్క్ టైమ్స్" వార్తా పత్రిక ప్రకారం, సైనిక నాయకులు రక్షణ విషయాలకు సంబంధించిన వార్షిక సభలో సమావేశమై, న్యూక్లియర్ ఆయుధాల పాటవపరీక్షల ఆపుదలకు అమెరికా ఎటువంటి ఒడంబడికనైనా చేసుకోవడానికి సాహసిస్తుందా, లేదా అన్న విషయాన్ని తీవ్రంగా చర్చిస్తున్నారు. పరస్పర అజమాయిషీ అన్న షరతులపైని—ప్రస్తుతం దీని స్థాపన సాధ్యంగా కనిపిస్తోంది—యిటువంటి ఆపుదలను సైనిక నాయకులు వ్యతిరేకించారని, ఆ వార్తా పత్రిక వివరించింది.

ప్రపంచ ప్రజలకు, సకలదేశాల ప్రజానీకానికీ, ప్రభుత్వాల నిజాయితీని యింకోసారి పరీక్షించడానికి, పరమాణు యుద్ధ వినాశనం నుండి మానవజాతిని విముక్తి గావించడానికి అవి నిజంగా వాంఛిస్తున్నవా లేదా అన్నదానిని కనుగొనడానికీ యిప్పుడొక అవకాశం లభించింది.

సోవియట్ దేశం ఒక అడుగు వేసింది. ఇక అమెరికా, బ్రిటన్ ప్రభుత్వాల వంతు వచ్చింది.

# మనిషికి పని ముఖ్యావశ్యకం

**ఎ. స్మిర్నోవ్**

కార్మికునిగా నికొలాయ్ మిఖెయేవ్ జీవిత చరిత్రలో, సర్వదా జ్ఞాపకం వుండే రెండు తేదీలున్నాయి: మాస్కోలోని పెద్ద పరిశ్రమల్లో ఒకటైన వ్లాదిమిర్ ఇల్యిచ్ పరిశ్రమలో మొదట ఆయన పని ప్రారంభించిన 1926 ఆకురాలు కాలం, ముప్ఫయ్యేళ్ళ తదుపరి ఆయన పింఛనీ పుచ్చుకున్న 1956 ఆకురాలు కాలం. రెండవది ముఖ్యమైన, స్మరణీయమైన సందర్భం. అధికారులు ఆయనకు గౌరవపత్రాన్నీ, విలువైన కానుకనూ బహూకరించారు; ఆయన కామ్రేడ్స్ ఒక వాచీ నిచ్చారు. ఈ ఎడబాటుచాలా బాధాకరంగా వుంది.

నికొలాయ్ మిఖెయేవ్ తన పరిశ్రమ వదిలి పెట్టాడన్న మాట. నేను బాగా విశ్రాంతి తీసుకుంటాను అని ఆయన తనలో తాను అనుకున్నాడు.

తను పెన్షనును తీసుకున్న మర్నాడే ఆయన తన భార్యతో యిలా అన్నారు: "తొందరగా నన్ను లేపవద్దు. బాగా నిద్రపోతాను." ఆయన భార్య ఆ మాటను నమ్మింది, అలారం వాచీనికూడా ఆయన గదిలోనుండి తీసివేసింది, ఉదయమే లేవవలసిన వాళ్ళు ఎవ్వరూ లేకపోవడంవల్ల.

కాని యిది జరిగింది ఒక్క రోజే. ఆ ఒక్క రోజునే మిఖెయేవ్ మామూలుకంటె ఆలస్యంగాలేచారు. ఉదయం ఆయన పత్రికను చదువుతూ కూచున్నారు. అప్పుడు అతని చిన్న మనుమరాలు లెనోచ్కా బడినుండి తిరిగి వచ్చింది. ఆఅమ్మాయి మొదటిఫారంలో వుంది, చదవడం ఇప్పటికే వచ్చేసింది. ఆ అమ్మాయి, తాత కూచొని చక్కని కథలు బిగ్గరగా ఒకరి తరువాత ఒకరు చదివారు. కాని లీనా హోమ్‌వర్క్ చేయవలసి వుంది. ఆ అమ్మాయి తన కాపీ పుస్తకాలను టేబులుమీద పెట్టి వ్రాయడం మొదలు పెట్టింది. తాతయ్య ఆలోచనలో పడ్డాడు. ఎంత వింతగా వుంది, యింకేమీ పనిలేక. అది ఆయనకు కాస్త భయంగాకూడా వుంది. అంచేత ఆయన ఏదైనా పని కోసం వెతుకులాడడం ప్రారంభించారు.

ఆయన సీటి గొట్టాన్ని అమర్చారు, వదులుగా వున్న తలుపు పిడికి మేకులు గొట్టారు. దేనికో స్క్రూ వదులుగా వుంటే బిగించారు. ఏదో విధంగా సాయంత్రంవరకూ పని కల్పించుకున్నారు. కాని ఆయన పథకం సరిగా వేసుకోలేదు ఆయనఅంతా ఒక్కరోజునే చేసివేశారు, రేపు, యింకో రేపు, యింకా యింకోరోజూ వుంటాయన్నది మర్చిపోయి. ఇక ఆ మర్నాడు వచ్చినప్పుడు, చేయడానికి ఆయనకు పనేమీ లేదు.

నికొలాయ్ మిఖెయేవ్ కనిపెట్టినట్టుగా, ఏమీ చేయకుండా వూరికే వుండడం కష్టం.

పడుకోడానికి ముందర ఆయనకు తన అలారం వాచీ గురించి జ్ఞాపకం వచ్చింది, తనగదిలో అది లేకపోవడం చూసి కాస్త చికాకెత్తింది. ఉదయం ఎనిమిదింటికి అలారం పెట్టమని, మామూలులాగనే, ఆయన చెప్పారు. ఆయన భార్య అలా పెట్టి, పనికి వెళ్ళదల్చుకున్నారా అని భర్తను అడిగింది. అవునని జబాబు వచ్చింది. ఆయనకు డబ్బు అక్కరేదు, పెన్షన్ చాలును. తనకు కావలసిందల్లా పని.

ఇందులో సిగ్గుపడవలసిందేమీ లేదు. కాని ఆయన తన పరిశ్రమకు వెళ్ళినప్పుడు కాస్త బెరుకుగా వున్నారు. అక్కడ ద్వారం దగ్గర తన పాత స్నేహితుడు ద్మిత్రీ కజకోవ్ కనిపించాడు. ఈయన కూడా మిఖెయేవ్ పింఛను పుచ్చుకున్నప్పుడే పింఛను పుచ్చుకున్నారు.

మిఖెయేవ్, కజకోవ్ మాత్రమేకాదు ఆవేళ పరిశ్రమకు వచ్చిన వాళ్ళు. ఇంకా చాలామంది కూడా వచ్చారు. గత ఏడాది 50 ఏళ్ళ, అనుభవజ్ఞులైన కార్మికులు పెన్షన్ పుచ్చుకున్నారు. కాని ఒక్కరు కూడా తమకు ఎంతో ప్రీతిపాత్రమైన పరిశ్రమనుండి విడిపోదలుచుకోలేదు. ప్రతి ఒక్కరూ ఏదో ఒకటి చెయ్యదల్చుకున్నారు, ఏదో

(మిగత 39వ పుటలో)

పింఛన్ పుచ్చుకొన్న నికొలాయ్ మిఖెయేవ్ తన మనుమరాలిని పాఠశాలకు పంపుతూ
(ఛాయాచిత్రకారుడు:
(ఒ. క్నెపర్‌స్కీ)





# నీటిమీది బడి



మాస్కోలోని అతి చక్కని పేటలలో ఒకటైన లెనిన్‌గ్రాడ్ స్కాయ్ రహదారి పైనున్న యీ భవనం తొలిచూపుకు, మామూలు బడిలాగా కనిపిస్తుంది. సంచులు పట్టుకునివున్న పిల్లల గుంపు ఈ అభిప్రాయాన్ని కలిగిస్తుంది (మొదటి చిత్రం).







కాని దాంట్లో మీరు ప్రవేశిస్తేంటే, అది అసాధారణమైన పా ర శా ల ని మీకు తెలిసి పోతుంది. పాఠాన్ని బోధపర్చుతోన్న ఉపాధ్యాయుణ్ణి చూడండి (రెండో చిత్రం). అక్కడ గుంపు కిక్కిరిసి లేదూ, ఉపాధ్యాయుడూ, విద్యార్థులూ వింత దుస్తులు వేసుకుని వున్నారుకదూ?

పెట్టెలు పట్టుకునివున్న కుర్రవాళ్లు తమ తీరుబాటు సమయాల్లో యిక్కడికి వచ్చిన దగ్గర్లోని పాఠశాలల పిల్లవాళ్లు. ఉపాధ్యాయుడు క్రీడావేత్త అలెగ్జాండర్ లిఫెరెంకో. ఈత ఉపాధ్యాయుడు.

"ఈ విధంగా మొదలు పెట్టాలి" అని అంటున్నారు లిఫెరెంకో, తన శిష్యురాలనితో (మూడో చిత్రం).

దగ్గర్లో కొంతమంది శిక్షణను పొందుతోన్న బా ర ల యీతగాళ్ళున్నారు. ఈత బుంగల సాయంతో వారి పద్ధతిని నేర్చుకుంటారు (నాలుగో చిత్రం). ఇంకొన్ని పాఠాలయినట్టయితే, మరి యీ బుంగ లక్కర్లేదు.



ఈతకు గంతువేసే శిఖరంమీద కూడా పిల్లలున్నారు. మీరు చూస్తూ వుండగానే లెన్యా గొనితెల్ అందంగా గెంతుతున్నాడు. ఆ తొమ్మిదేళ్ళ పిల్లవాని ధైర్యానికి మీరు ఆశ్చర్య పడతారు. పెద్దవాళ్ళు సైతం ఐదు మీటర్ల శిఖరంనుండి గెంత డానికి సాహసించలేరు (ఐదో చిత్రం).

"మీ జారడం బాగా లేదు" అని ఉపాధ్యాయుడు ఒలొద్యా కతెరిన్ ఛుక్, ఆంద్రీ అలెక్సియేవ్‌లతో అంటున్నారు. "మీరు రబ్బరు యీత ఫిన్స్ పెట్టుకోవాలి. తేలడానికి అవి సాయపడతాయి, శరీరం అంతటితో జారడానికీ, చేయి, కాలు సరిగ్గా సమన్వయపర్చడానికీ" (ఆరో చిత్రం).



సోవియట్ దేశంలో బాల్యం నుండీ యీత పట్ల ఎంతో శ్రద్ధ చూపబడుతుంది. "నీటి పైని బడుటు" వుండదం ఒక్క మాస్కోలోనే కాదు; తాలిన్, కీవ్, తబిలిసి, లెనిన్‌గ్రాడ్ మొదలైన నగరాలలో కూడా ఒకకొత్త తరం గజ యీతగాళ్ళు పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు.

# మహోత్సవానికి యువ చిత్రకారులు

మాస్కో సుషుప్తిలో వుంది, కాని ఒలెగ్ సెవస్తియుక్, బోరిస్ ఉస్పెన్‌స్కీ పనిచేస్తోన్న గదిలో దీపాలు యింకా చాలా సేపటివరకూ ఆరవు. ఇంకా చేయవలసింది చాలావుంది. ఉత్సవం దగ్గర పడిపోతుంది.

మంచి పోస్టర్‌ను వ్రాయడం ఎంత మాత్రమూ తేలికకాదు. కొన్ని సందర్భాల్లో చిత్రకారుడు నిరాశతో "యిది పూర్తికాదా?" అని అరుస్తాడు (ఎడమ).




కాని హటాత్తుగా "నిజమైన విషయం" దొరికి పోతుంది. ఒలెగ్ తన స్నేహితునికి తొందర తొందరగా గీసిన బొమ్మను చూపించి "ఇలాంటి దేదయినా యెలా వుంటుందనుకుంటావు?" అని అడుగుతాడు.

# కొత్త యిళ్లలోకి పోతున్న లక్షలాది ప్రజ

[9 వ పేజి తరువాయి]

ఇల్లు పొడుగా లేదు. దురదృష్టవశాత్తు యిది ముందు భాగం నుండి కాక, వెనుకనుండి తీయబడినది. తమ యిళ్ళలోనికి కొత్త గృహస్తులు ప్రవేశిస్తోన్న క్షణాన తీయడానికి ఛాయాచిత్రగ్రాహకుడు ప్రయత్నించినట్టుగా వుంది. వారి వస్తువులతో వున్న లారీలను చూడండి.

ఈ అంతస్తుల యింటిని వృత్తి తాపీపనివారు కట్టలేదు. నిర్మాతలు కీవ్ మెకానికల్ పరిశ్రమ టర్నర్లు, మిల్లింగ్ మెషీన్ ఆపరేటర్లు, ఫిట్టర్లు. తాముగా వీరు యీ పెద్దయింటిని కట్టడానికి ఎంత కాలం పట్టింది? ఎక్కువవేమీకాదు, ఎనిమిది నెలలు మాత్రమే.

ప్రజలే కనుగొన్న పరిష్కారమార్గం యిది. తమ యిళ్ళను తామే కట్టుకున్నారు. చాలినంతమంది నిర్మాతలు లేకపోవడంవల్ల, బృహత్ గృహనిర్మాణ కార్యక్రమంలో సహాయ పడడానికి ప్రజలు నిర్ణయించుకున్నారు, ఆనందదాయకమైన గృహప్రవేశోత్సవాలను చేరువగా తీసుకరావడానికి పూనుకున్నారు.

దీనిని— "ఔత్సాహిక" నిర్మాణం అని అనవచ్చును— ప్రారంభించినవారు గోర్కీ మోటారు పరిశ్రమ కార్మికులు.

ఈ పరిశ్రమకు ప్రత్యేకమైన నిర్మాణసంస్థ, చాలా వస్తుసామగ్రితోనూ, చాలా ఏళ్ళ అనుభవంతోనూ వుంది. కాని హఠాత్తుగా నిర్మాత అన్న కీర్తిని, యింతకు ముందెన్నడూ యీ పనిని చేయని మనిషి పొందాడు ఎవరాయన?

ఈయన ఒక ఆటోమేటిక్ ఇంజనీరు, పరిశ్రమ స్టాంపింగ్ శాఖ సూపరెండెంటు, యీయన యిటీవల వరకూ లోహపు పని సాంకేతిక విద్యలో మాత్రమే ప్రత్యేకించి పనిచేస్తూ వుండేవారు. ఈయన పేరు షైతొర్ ఛెర్నియేవ్.

కార్యనిర్వాహకులలో ఒకరుగా యిళ్ళ కొరతను గురించి కార్మికుల ఫిర్యాదులను తరచుగా వింటూవుండేవారు. ఆయన ఎన్నో సార్లు వీటిని విని విని, "కార్మికులు యింకా ఎంతకాలం వేచి వుండాలి? నిర్మాతలు అందరికీ యిళ్ళను యివ్వలేరు గాబట్టి, మేమే యీ పనిని చేసుకోవాలి" అని తనలో తాను అనుకున్నారు.

ఇది యీ విధంగా మొదలైంది.

ఛెర్నియేవ్ ఉద్దేశాన్ని అధికారులూ, సహజంగా యిళ్ళ అవసరంవున్న కార్మికులు కూడా బలపర్చారు. గృహనిర్మాణ దళాలను వెంటనే నెలకొల్పాలనీ, పనిని మొదలు పెట్టాలనీ కార్మికులు వెంటనే సూచించారు. ఇంజనీరు ఛెర్నియేవ్ యీ ముఖ్యమైన ప్రజాహిత విధికి నాయకత్వం వహించారు.

ఆరువందల కుటుంబాలు 18 గంటలలో కొత్త యిళ్ళలో ప్రవేశించాక దేశం ఛెర్నియేవ్ గురించి, ఔత్సాహిక నిర్మాతల గురించి తెలుసుకుంది. ఈ ఏడాది గోర్కీ ఆటోమొబైల్ పరిశ్రమ పనివారు యింకో 800 కుటుంబాలకు సదుపాయమైన యిళ్ళను కడతారు.

కార్మికులకు ఎటువంటి లాభం కలిగిందో మనకు తెలుసును. వందల కొలదీ కొత్త యిళ్ళు!

కాని పరిశ్రమ నష్టపడిందా? కార్లను ఉత్పత్తిచేసే కార్మికులు, ఈ నిర్మాణానికి మళ్ళిపోలేదా?

లేదు. తమ యిళ్ళను కట్టుకునే కార్మికులు తమ సెలవు రోజుల్లోనూ, తమపని అయిపోయాక మాత్రమే నిర్మాణ స్థలాలకు వచ్చేవారు. పరిశ్రమలోని తమ పనులనుండి పూర్తిగా విడుదల చేయబడిన కార్మికుల విషయంలో, వారితోటి కార్మికులు వారివిధులను పూర్తిగా నెరవేరేందుకుగాను ఉత్పత్తిని సమీకరించేవారు.

ఇంకో ప్రశ్న వస్తుంది: క్లిష్టమైన నిర్మాణపు పనులను కార్మికులు ఎలా చేయగలిగేవారు?

వారికి శిక్షణ యివ్వబడింది. ఇంజనీర్లూ, నిర్మాతలూ నిర్మాణపు ప్రాథమిక సూత్రాలను వారికి నేర్పారు. ఉన్నత ప్రావీణ్యం గల నిర్మాణ కార్మికులు యీ దళాలకు నాయకత్వం వహించారు.

ఇక ఆఖరు ప్రశ్నలు: డబ్బు విషయమేమిటి? ఈ యిళ్ళు ఎవరి ఖర్చుతో నిర్మింపబడ్డాయి? నిర్మాణ వస్తువులను యెవరు సరఫరా చేశారు?

ఈ విషయంలో పరిశ్రమే అన్ని ఖర్చులూ భరించింది. నూతన నిర్మాణంకోసం దానికి కేటాయింపబడిన వాటినుండి కావలసిన నిర్మాణ వస్తువుల నన్నిటినీ అది సరఫరా చేసింది. ఇదే డబ్బు విషయంలోనూ జరిగింది. కార్మికులు తమ శ్రమను పెట్టుబడిగా పెట్టారు.

చాలా పరిశ్రమలు లోహపు మురికినుండి దిమ్మలను నిర్మించడము స్వంతంగా ఏర్పరుచుకున్నాయి. రద్దు వస్తువులను అవి ఉపయోగించుకున్నాయి. ఉదాహరణకు బుట్టలను ప్యాక్ చేయడానికి ఉపయోగింపబడిన యినుమును పైకప్పు తయారీకి వారు ఉపయోగించుకున్నారు. ఆదా చేయబడిన లోహం నిర్మాణానికి ఉపయోగింబడింది. గృహ నిర్మాణంలో ఉపయోగించడానికి వస్తువులను దాచడానికి కొత్త పద్ధతులను వెతికారు, కొత్త పద్ధలను కనిపెట్టేవారూ, రేషనలైజర్లూ.

"ఔత్సాహికులు" నిర్మించిన యిళ్ళలో కార్మికునికి యిల్లు యివ్వబడుతుంది, దానికి అతను మామూలు విధంగా అద్దెను చెల్లిస్తాడు. యిది అతని ఆదాయంలో నూటికి 4-5 వంతులకు మించదు.

కాని మిగతా కార్మికులకు, స్వంత యిళ్ళు కావాలి. అటువంటి వారికి ప్రభుత్వం అప్పులు యిస్తుంది. కొంతమంది కార్మికులు తమకు వచ్చిన అప్పులను ఒకచోట చేర్చి, ఒక గృహనిర్మాణ సహకార సంఘాన్ని ఏర్పర్చుకోవచ్చును. ప్రభుత్వం వారికి నిర్మాణ వస్తువులూ, అవసరమైతే అదనపు అప్పులూ యిస్తుంది. వారు సమిష్టిగా తమకోసం ఒక యిల్లు కట్టుకోవచ్చును. చాలా సంవత్సరాల తరవాత అప్పులు తిరిగి చెల్లింపబడతాయి.

ఒక్క తమ కుటుంబం కోసం మాత్రమే యిల్లు కట్టుకోదల్చుకున్నవారికి కూడా, ప్రభుత్వం అప్పులు యిస్తుంది. ప్రభుత్వ రుణాల సహాయంతో కార్మికులు తామే కట్టుకున్న 350 యిళ్లుగల ఒక పేట, బ్రియాన్స్క్ ఉక్కుమిల్లు దగ్గర లేచింది. మిల్లు, కార్మికులకు నిర్మాణ వస్తువులనూ, రవాణా సౌకర్యాలనూ యిచ్చి, పనిని నేర్పేవారిని కేటాయించి సాయపడింది.

సోవియట్ ప్రభుత్వ నిర్ణయాలలో ప్రజల చొరవ ప్రతిబింబిస్తుంది. గృహనిర్మాణ విషయంలో పంచవర్ష ప్రణాళిక కేటాయింపుల్లో పెద్ద మార్పులు తీసుకరాబడుతున్నాయి. ప్రజలు పూనుకుని చేస్తోన్న పనులకు ప్రభుత్వం పూర్తిగా మద్దత్తు నిస్తోంది.

# మనస్సుకు రూపులు

*లూయీ అరగాన్ చాలా ప్రఖ్యాతుడైన ఫ్రెంచి రచయిత, కవి. వీరికి రష్యన్ భాష, సోవియట్ సారస్వతమూ బాగా తెలుసును. ఈయన సోవియట్ కథానికా సంకలనాన్ని ఫ్రాన్సులో ప్రచురించారు. దానికి సమగ్రమైన ఒక ఉపోద్ఘాతాన్ని వ్రాసేరు. అది "విదేశీ సారస్వతం" అనబడే సోవియట్ పత్రికలో పునర్ముద్రింపబడి పాఠకుల ప్రశంసల నందుకుంది. స్థలాభావం వల్ల ఆ వ్యాసాన్నంతట్నీ ఇక్కడ ప్రచురింపలేక పోవడంవల్ల, "సోవియట్ సారస్వత పరిచయం" అన్న అరగాన్ ఉపోద్ఘాత సంగ్రహాన్ని యిక్కడ యిస్తున్నాము.*

## కాంతిని మరుగుపర్చే కళ్లద్దాలు

సోవియట్ సారస్వతం గురించి తన ప్రసంగాన్ని ప్రారంభిస్తూ అరగాన్, ప్రసిద్ధ వ్యంగ్యకారుడు విలియం మేక్‌పీస్ థేకరే రచించిన ప్రఖ్యాతమైన "బుక్ ఆఫ్ స్నాబ్స్"ను పేర్కొన్నారు. కొన్ని ఫ్రెంచి మేధావి వర్గాలకు (ఫ్రెంచి మేధావి వర్గాలు మాత్రమే కాదు) అతి సహజమైన మన స్థితికి సరిగ్గా సరిపడే నిర్వచనం, బడాయికోరు తనం. సోవియట్ దేశానికి సంబంధించిన ప్రతి ఒక్కదానినీ తక్కువగా చూడడం వివిధ మేధావులలో యిటీవల ఫాషన్ అయిపోయింది. "రష్యా గురించి అభిప్రాయాన్ని ఏర్పరచుకోవడంలో తనకు దురభిప్రాయాలేవీ లేవనుకునే ఫ్రెంచి వ్యక్తికి, యిందువల్లనే కొన్ని యిబ్బందులు యెదురౌతుంటాయి" అంటున్నారు అరగాన్. "అతిసులభమైన విషయాల గురించి నిర్ణయానికి రావడంకూడా ఆయనకు కష్టమే (బాహ్యంగా సులభమైనవని నా ఉద్దేశం—అధునాతన రష్యన్ వచనంవంటి సులభంగా లభ్యం అయ్యేటువంటివి). అంధత్వం వస్తుందన్న భయంలేకుండా సోవియట్ గ్రంథాలను చదవడానికి, హేళనకు పాలు గావడానికీ, లేదా సత్యమార్గాన్ని తప్పడానికీ సాహసించే జిజ్ఞాసువైనప్పటికీ యీ సాధారణ పాఠకుడు, తాను గమనించకుండానే మొదట బడాయి తనపు కళ్ళద్దాలు పెట్టుకుంటాడు."

ఈ సంకలనాన్ని సమకూర్చడానికీ, దానికి ఉపోద్ఘాతాన్ని వ్రాయడానికీ అరగాన్ పూనుకోవడానికి కారణం, యీ కళ్ళద్దాలను పాఠకుడు వదుల్చుకోవడానికి తోడ్పడడం.

## అంతన్ చెకోవ్‌నుండి మిహెయిల్ షొలొఖోవ్ వరకూ

ఈనాటి బడాయికోరు తనంలో వున్న దొకటేమిటంటే సోవియట్ సారస్వతానికి "దానికి ముందరి సారస్వతంతో సంబంధం లేదని" అనడం. అంటే "రాజకీయ భావాలను రేకెత్తించకుండా ఫ్రాన్సులో పలుసంవత్సరాలు ప్రశంసల నందుకున్న 1917కు పూర్వపు రష్యన్ సారస్వతంతో" అన్నమాట.

"ప్రాచీన రష్యన్ సారస్వత ఘనతకు ప్రాతిపదిక, అది నిండు సత్యంతో కూడిన సారస్వతం, వాస్తవిక సారస్వతం కావడమేనని అరగాన్ అంటున్నారు. అరగాన్ దేశీయుడైన విస్కౌంట్ ఇ. యం. డి. వోగ్ దెబ్భయ్యేళ్ళ క్రితం, వాస్తవికత ప్రజాస్వామిక కళ అంటూ నొక్కి చెప్తూ వాస్తవిక సారస్వత పరిణామ మూల సూత్రాన్ని తెలియజేయడానికి ప్రయత్నించారు. "మన నీరసించిన కళకు గొప్ప రష్యన్ రచయితల ప్రభావం లాభదాయకంగా వుంటుందని నా విశ్వాసం; అది మళ్ళీ లేవడానికి తోడ్పడుతుందనీ, జీవిత పరిశీలనను బోధిస్తూ, అదే సమయంలో యింకా ముందుకు చూడడానికి, అతిముఖ్య విషయమైన భావనాశక్తిని తిరిగి పొందడానికీ తోడ్పడుతుందనీ నా విశ్వాసం...." అన్నారు డి వోగ్.

"రష్యన్ సారస్వతం గురించి డి వోగ్ అన్నదంతా అధునాతన సోవియట్ సారస్వతానికి సులభంగా వర్తింపజేయవచ్చును" అన్నారు అరగాన్. తనకాలపు రష్యన్ సారస్వత గుణంగా డి వోగ్‌కు అనిపించిన మార్గంలోనే యిదీ పోతోంది. సోవియట్ సారస్వతం కూడా వాస్తవికమైనది, సాధ్యమైనంతమేరకు చూడడానికి అదీ ప్రయత్నిస్తుంది, అది కూడా ఆవేశపూరితమైనది.

"సోవియట్ సారస్వత వాస్తవికత, యదార్థ విషయాల ఉద్ఘాటనకు మాత్రమే పరిమితమైన, మనం సహజవాదం అనేది కాదు, పాతరకపు వాస్తవికత కాదు....ఈ వాస్తవికత ప్రకృతిని శాస్త్రీయంగా అవగాహన చేసుకోవడం మాత్రమే కాకుండా, తనలో ప్రపంచాత్మను, అవగాహననూ పెట్టుకుని వుంటుంది—తమ పరిసరాలలోని వాస్తవికతను చిత్రించడం మాత్రమే కాకుండా, దానిని మార్చడానికికూడా ప్రయత్నించే రచయితలందరికీ యిది వుంటుంది. ఈ వాస్తవికత సామ్యవాద సమాజాన్ని ప్రతిబింబిస్తుంది గాబట్టి, సరిగ్గా యీ సమాజాన్ని అనుసరించి ప్రజలను మార్చడం దాని లక్ష్యం గాబట్టి, దానికి సహజంగా సామ్యవాద వాస్తవికత అన్న పేరు వచ్చింది."

## అధునాతన సారస్వతాత్మ

సంశయాత్ముడుగాని, బడాయికోరుగాని యీ విధంగా అగడవచ్చును, "సామ్యవాద వాస్తవికతను నిర్ణయించే ఆత్మను నవలలో కనుగొనడమెలాగ, అది వుంటుందని అనుకున్నప్పటికీ?"

"ఉదాహరణ లివ్వవలసి వుంటుంది, నేను అంగీకరిస్తాను" అని వ్రాస్తున్నారు అరగాన్. "మూడు చాలునా? ఇవుగో: నికొలాయ్ ఓస్త్రొవస్కీ వ్రాసిన "హౌ స్టీల్ వజ్ టెంపర్డ్" (1932-34). ఎ. ఎస్. మకరెంకో వ్రాసిన "పెడగాగికల్ పోయమ్" (1933-35), బోరిస్ పొలెవోయ్ వ్రాసిన "ది స్టోరీ ఆఫ్ ఎ రియల్ మేన్" (1946). ఈ మూడు పుస్తకాలకు నేను చాలా విలువనిచ్చినప్పటికీ, వాటి సాహిత్య

# పెద్ద మహాగ్రంథాలు

గుణాలు వాటికి తక్కిన సోవియట్ సారస్వత గ్రంథాలకంటె అధిక తర స్థానాన్ని యిస్తున్నవని నేను వాదించను. కాని వాటి విశిష్టత ఏమిటంటే, సహజవాదానికి లేని ఆత్మ వాటికుంది. ఈ పుస్తకాలను చదవకుండా సోవియట్ సారస్వతం గురించి ఎటువంటి అభిప్రాయాన్ని చెప్పడం యించుమించు అసాధ్యమనిపిస్తుంది నాకు.

"....నిస్సందేహంగా యీ మూడు పుస్తకాలూ వివిధ స్థాయీ భేదాలతో, మనస్సును రూపొందించే రచనలకు చెందినవి. పాఠకులలో అవి పొందిన అపార విజయాన్ని, ఆదరణనూ సారస్వత చరిత్రలో వీర నవలలు యువకుల మనస్సులపైని గతంలో చూపిన ప్రభావంతో మాత్రమే సరిపోల్చవచ్చును....ఫ్రెంచి యువకుడు యీ శతాబ్దం ప్రారంభంలో (మధ్యలో కూడా) ఇలా తన్నుతాను ప్రశ్నించుకునేవాడు: 'నేను ఒక రస్టిగ్నాక్‌ను కాగలనా'....కాని సోవియట్ యువకుడు "హౌ ది స్టీల్ వజ్ టెంపర్డ్" అన్న నవల లోని నాయకుడు పావ్కా కోర్చగిన్ వలె లేదా పొలెటయ్ రచనలోని మెరెసివ్ వలె వుండడానికి కలలు గంటాడు. మొదటివాడు కమ్యూనిస్టు యువకుడు, అంతర్యుద్ధ కాలంలో గాయపడి, దృష్టి పోగొట్టుకుంటాడు, పక్షవాతం వస్తుంది. కాని యీ బాధ, యాతనలు, వ్యాధి తనను నిరుత్సాహపర్చ నివ్వడు. ఒక ఆదర్శంకొరకు పోరాటానికి అతను తనయావచ్ఛక్తినీ అర్పిస్తాడు, శారీరకంగా నశించినట్టుగా కనిపించినప్పటికీ తన పుస్తకాలను చెప్పివ్రాయించడం సాగిస్తాడు, తన లాగనే ప్రజలు తయారయ్యేందుకు సాయపడతాడు. రెండో అతను వైమానికుడు, యితనుకూడా దృఢదీక్షాబద్ధుడు, గతయుద్ధంలో రెండు కాళ్లూ పోయాయి. మళ్ళీ విమానంలో ఎగరడం నేర్చుకోవడానికి యీయన అన్ని అడ్డంకులనూ దాటతాడు. ఈ పుస్తకాలకు మకరెంకో "పెడగాగికల్ పోయమ్" లోని మానవశక్తినీ, నైతిక వైభవాన్నీ సహజంగా చేర్చవలసి వుంటుంది. బాల నేరస్థుల పునర్విద్యకు సంబంధించిన కథ యిది. చెడిపోయిన పిల్లలను సరిదిద్దడానికి ఉపాధ్యాయుడు చేసిన కృషిని తెలియజేసే మహాకావ్యం యిది. ఇది దురధికార వర్గాన్ని ఖండిస్తుంది, అంతర్యుద్ధంవల్ల నాశనమైన దేశంలోని ఘోర కష్టాల కథ యిది. లక్షలాది మంది యీ యీ పుస్తకాలను బట్టి తమ జీవితాలను చక్క దిద్దుకున్నారు, చక్క దిద్దుకుంటున్నారు. ఈ కొత్త ప్రపంచంలోనికి—దీనిని గురించి ఎంతో తప్పుడు ప్రచారం సాగింది—నేను జిజ్ఞాసులను తీసుక వెళ్ళవలసి వచ్చినట్టయితే, నేను వారిని యీ ద్వారంగుండానే, యిక్కడ ఫ్రాన్సులో వాదింపబడినట్టుగా సోవియట్ సారస్వతంలో అంతా నిత్య కల్యాణం పచ్చ తోరణంగా వుందన్న ధోరణిలో వాటితో ఏమీ పోలికలేని యీ పుస్తకాల ద్వారానే నేను వారిని ప్రవేశపెడతాను. ఈ పుస్తకాలు కంపరం పుట్టిస్తాయి, తమ దేశం గురించి మెచ్చుకోవలసిన దానిని బహూశా కొద్దిగా మాత్రమే చెప్తాయి, తమ భౌతిక సంక్షేమానికి ప్రాధాన్యతను యిచ్చి, నిర్వాసుల గురించి కట్టుకథలను నమ్మేవారి దృక్కోణంనుండి ప్రపంచాన్ని పరిశీలించవలసివస్తే. కాని ఈ పుస్తకాలలో పంచవర్ష ప్రణాళికల కోసం, స్టాలిన్‌గ్రాడ్ కోసమూ ఎన్నో త్యాగాలు చేసిన ప్రజల వైభవం నిండుదనంతో మనకు కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తుంది.

## శ్రేయస్సు వగైరా

"మనలోమాటగాని, సోవియట్ సారస్వతం అన్నది నిజంగా వుందా?" అంటూ ఒక నాగరికత ఎరుగని బడాయికోరు ప్రశ్నిస్తాడు.

"అవును, అది నిజంగా వుంది, నాగరికత ఎరుగని బడాయికోరుకు అది ఎంతటి విషాదకరమైన విషయమైనప్పటికీ" అంటూ ఆరగాన్ జబాబిస్తారు. ఇది ఉన్నతమానవతతోకూడిన, నిజమయిన వాస్తవికతగల, ప్రతిభాసమన్వితమైన, వివిధ శైలులూ, ధోరణులూ గల సారస్వతం యిది.

# సోవియట్ సారస్వతం గురించి లూయీ ఆరగాన్

"సోవియట్ శకపు తొలినాళ్ళవేపుకు మనం దృష్టిసారించినట్టయితే, తమ ప్రతిభచే ఫ్రాన్సులో గణనకెక్కిన వారి పేర్లను తేజోవిహీనం గావించే రచయితలపేర్లు మనకు తప్పకుండా కనిపిస్తాయి. 1917-1930 మధ్యలో ఏదేశం ప్రపంచ ప్రఖ్యాతిని గన్న అలెగ్జాండర్ బ్లాక్, సెర్గీ ఎసెనిన్, వ్లాదిమిర్ మయకొవస్కీ వంటి కవులను సృష్టించింది?....రష్యన్ విప్లవ ప్రారంభంలో రష్యన్ కవిత ఉన్నత పథాలకు వెళ్ళింది, నెక్రసోవ్‌నూ, లెర్మొంతోవ్‌నూ, పుష్కిన్‌నూ సరిపోలే వారికోసం చాలా వెనకకు పోయి వెతకవలసి వుంటుంది."

సోవియట్ సారస్వతం వాస్తవానికి అనేకవైన సారస్వతాలు. విప్లవానికి ముందర సారస్వతంలేని ప్రజలు మాత్రమే కాకుండా, "స్వంత లిపికూడా లేనివారు కూడా యిప్పుడు స్వీయ నవలాకారులను సృష్టించుకుంటున్నారు (ఉదాహరణకు ఛుక్చి యూరీ రైతెఖెవు, ఉదిగై జాన్సీ కిమొంకొ, తువనీస సలకతోకా)"

ఫ్రెంచి పాఠకులకు, సోవియట్ దేశపు యావత్తు సారస్వత సంపదనూ, వైవిధ్యాన్నీ స్థాలీపులాక న్యాయంగానైనా పరిచయం గావించేందుకు, ఆరగాన్ "సోవియట్ సారస్వతాలు" అన్న కథానికా సంపుటాన్ని ప్రచురించారు.

"ఈ పుస్తకంలో గోర్కీగాని, మయకొవస్కీగాని, గ్లాద్కోవ్ గాని, షొలొఖోవ్‌గాని, ఫెద్యేవ్‌గాని, ఎహ్రెన్‌బర్గ్‌గాని, లియొనోవ్ గాని లేరు. ఈ పుస్తకాన్ని సంకలనం చేసేటప్పుడు నేను దాని పరిమితిని దృష్టిలో పెట్టుకోవలసి వచ్చింది. ముఖ్యంగా ప్రమాణం మీద ఆధారపడింది, తరవాత మాత్రమే నా అభిరుచి. నా పాఠకుల అభిరుచిపైని ఆధారపడింది." అయినా అరగాఁ పుస్తకం సోవియట్ సారస్వతంలోని భిన్నభిన్న శైలులూ, ధోరణులూ, రూపాలూ, వాటి సంపద గురించి స్పష్టంగా తెలియజేస్తుంది.

"రోడ్‌టు కాల్వరీ" అన్న త్రై సంపుట నవలనూ, "ఒకటో పీటర్"అన్న చారిత్రిక నవలనూవ్రాసిన ప్రఖ్యాత సోవియట్ రచయిత అలెక్సీ టాల్‌స్టాయి కథ "మేరీ ఆంతోయినెట్టీ గోబెలిన్" అన్న దానితో యీ పుస్తకం మొదలవుతుంది. ప్రాచీన రష్యన్ జమీందారీ వంశీకుడైన కౌంట్ అలెక్సీ టాల్‌స్టాయి విప్లవం రోజుల్లో సోవియట్ దేశంనుండి వెళ్ళిపోయారు, కాని చాలా సంవత్సరాల తరవాత తిరిగీ వచ్చేశారు, ప్రజల ఆదర్శంలోని న్యాయంపట్ల ఆయనకు విశ్వాసం కలిగాక, అలెక్సీ టాల్‌స్టాయి రచన, గోర్కీ రచనవలె సోవియట్ సారస్వతాన్ని విప్లవానికి పూర్వపు రష్యాతో కలుపుతుంది గాబట్టి, అరగాన్ యీ పుస్తకాన్ని అలెక్సీ టాల్‌స్టాయితో మొదలుపెట్టారు.

అక్టోబరు విప్లవంలో పాల్గొన్న, అంతర్యుద్ధంలో సైనికుడైన వ్సెవొలోద్ విష్నెవ్‌స్కీతో రెండవకథ మొదలవుతుంది. ఈయన ప్రఖ్యాతమైన "అప్టిమిస్టిక్ ట్రాజిడి" గ్రంధకర్త. "ఈయన తొలి తరం సోవియట్ గ్రంధకర్త. నవలాకారుడు, కాల్పనికుడు కూడా" అంటూ అరగాఁ విష్నెవ్‌స్కీని వర్ణించారు. "ఈయన ప్రతిభకు విశిష్టమైన ఒక మౌలిక కమనీయత, యీయనను మనకాలపు ఒక ప్రముఖ నాటక కర్తగా చేసింది. విష్నెవ్‌స్కీ సర్వదా అంతర్యుద్ధ సైనికునిగా వుండిపోయారు; ఆయన యావత్తు రచనలోనూ ఆ కళపు వాతావరణం ప్రస్ఫుటమవుతుంది. తన మిత్రులూ, వీరులూ అయిన నావికుల గొప్ప సాహస కృత్యాల నాయన గానం చేస్తారు."

"డెనిస్ ఉర్గీ కృతజ్ఞత"అన్నది లాట్వియఁ గ్రంధకర్త విలిస్ లాసిస్‌చే రచింపబడింది. ఈయన ఒక కార్మికుని పుత్రుడు. మొదట నీయన ఒక ముద్రణాలయంలో పనికుర్రవానిగానూ, తరవాత జాలరి గానూ, ఓడ కళాసీగానూ, కలప పనివానిగానూ, స్టోకర్‌గానూ పని చేశారు. ఇప్పుడాయన సోవియట్ లాట్వియాలోని ప్రముఖ రచయిత లలో ఒకరు, లాట్వియన్ గోర్కీ అయిన ఉపిట్స్‌తో సమాన హోదాలో."

కాన్‌స్తంతిన్ పౌస్తొవస్కీ జీవితంలో యింత వైవిధ్యమూ వుంది. ఆయన మెకానిక్కు, ట్రాము కండక్టరు, నావికుడు, ఫాక్టరీ కార్మికుడు, అంబ్యులెన్సు పనిమనిషి, సారస్వతోపాధ్యాయుడు, వార్తా పత్రికా రచయిత. ఆయన పని ఆయన జీవితమంతగా నవ్యతతో నిండివుంటుంది. కథకుడు అండర్సఁ గురించి "నైట్ కోచ్"అన్న పౌస్తొవస్కీ కథను అరగాఁ తన పుస్తకంలో చేర్చి యిలా వ్రాస్తున్నారు: "నాకు సాధ్యపడినట్టయితే, పౌస్తొవస్కీ కథలు ఒకటికాదు, రెండు మూడు చేర్చివుండేవాణ్ని."

ఫ్రెంచి పాఠకులకు అరగాన్ కథా సారస్వత మాంత్రికులైన యిద్దరి రచనలను పరిచయం గావించారు. మొదటి వ్యక్తి పావెల్ బజోవ్, "మలచైట్ బాక్స్" గ్రంధకర్త. ఈ అద్భుత ప్రపంచానికి చెందిన ఛార్లెస్ పెర్రాల్ట్, ఉరల్స్ నివాసి, చిన్న అభరణాలూ, కప్పులూ తయారు చేయబడే ఉరల్స్ రాళ్ళకు వలె అతని భాషను అనువదించడం కష్టం." ఉరల్స్ పరిశ్రమలలోని కార్మికులనుండి, కమ్మర్లనుండి "బజోవ్ గతకాలపు విస్మృత గాధలనూ, కథలనూ విన్నారు. అవి ఆయన కథలకు పునాదులై, జానపదభావ వైచిత్రితో నిండిపోయాయి."

రెండవ మాంత్రికుడు మిహేయిల్ ప్రిష్విఁ. ఈయన చాలా మౌలికతగల కళాకారుడు, ప్రకృతి, జీవిత సౌందర్యోపాసకుడు. ఆయనకు గోర్కీ 1926లో యిలా వ్రాసేరు: "మిహేయిల్ మిహైలోవిచ్, మీరు మానవ మిత్రులని మీ పుస్తకాలనుండి నేను స్పష్టంగా గ్రహించగలిగాను. మీగురించి చెప్పగలిగేటట్టుగా ఎక్కువమంది కళాకారుల గురించి యింత సులభంగానూ, యింత నిర్నిబంధంగానూ చెప్పలేము. మానవునిపట్ల మీ స్నేహాలు మీదేశ ప్రేమనుండి, మీ 'జియోఫిలిజం'నుండి, 'జియో-ఆప్టిమిజం'నుండి ఎంతో సహజముగా వస్తాయి....మీ మానవుడు చాలా వాస్తవిక వ్యక్తి, వాస్తవికతలో యిమిడి పోతాడు. మీ రచన యితర రచయితల రచనకంటె వాస్తవిక మైనది, మీది మహామాతకు అతి న్యాయబద్ధమైన శిశువు, మానవ పవిత్రాత్మలో నిజమైన చేతనత్వంతోకూడిన అణువు."

అరగాన్, గోర్కీ వ్రాసిన యీఉత్తరాన్ని తన ఉపోద్ఘాతంలో ఉదహరించారు.

వీరా పనోవా వ్రాసిన "సెర్యోజా" అన్న కథాభాగంతో రచయిత్రులకు ప్రాతినిధ్యం యివ్వబడింది. అరగాఁ అభిప్రాయంలో వీరా పనోవా "యీమె చాలా చర్చను లేకెత్తించినప్పటికీ సరికొత్త సారస్వత కాలానికి చెందిన అధికతర విశిష్టతగల రచయితలకు చెందుతుంది." "సెర్యోజా"అన్న కథ ఒక చిన్న కుర్రవాని జీవితంలోని అనేక గాధలతో కూడినది. వాటిలో ఒకటైన "మాపెద్దమామ్మ అంత్యక్రియలు"అన్న దానిని అరగాన్ యీ సంపుటంలో చేర్చారు.

ఇతర సమకాలీన రష్యన్ రచయితలకు చాలా మందికి వున్నట్టుగా, "వాతావరణాన్ని సృష్టించడంలో చెకోవ్‌ను అనుసరించడానికి" వాంఛ పనోవా విశిష్టగుణం కావడంవల్ల, అరగాఁ ఆమెను గౌరవిస్తారు. అరగాఁ అభిప్రాయంలో అటువంటి రచయితలలోని వారు సెర్గీ అంతొనోవ్. "వానలు" అన్న యీయన కథ యీ పుస్తకంలో చేర్చబడింది. "ఈ కథలో, యీ సంపుటంలోని వారందరిలో చిన్నవాడైన యీరచయిత కొత్త గొంతుక తక్కినవాటిలోకంటె ఎక్కువ స్పష్టంగా వినిపిస్తుంది. "పెద్ద మామ్మ అంత్యక్రియలు", "వానలు"

అన్న యీ రెండు కథలలోనూ మనం వాస్తవిక జీవితంలో ఆసక్తి చూపుతాము. వీటిలో గ్రంథకర్తలు అపూర్వ విషయాలనుకాక, నిత్య ఘటనలను చూపుతారు" అని అరగాన్ వ్రాసేరు.

## భావిదృష్టిగల సారస్వతం

సోవియట్ సారస్వతాన్ని అరిగాన్ చాలా విలువైనదానిగా భావిస్తారు. కాని సామ్యవాద వాస్తవికతకు చెందిన సారస్వత విజయాలు సోవియట్ రచయితలకు ఎక్కువ సంతృప్తి యీయలేదని ఆయన బాగా ఎరుగుదురు. "రష్యన్ అరణ్యం" అన్న తన నవలకు యిటీవల లెనిన్ బహుమానాన్ని పొందిన లెయొనిద్ లియొనోవ్ మాటలను ఉదహరిస్తూ అరగాన్ "సోవియట్ సారస్వ"తానికి తన ఉపోద్ఘాతాన్ని ముగించడం ఊరకనేకాదు. 1956 జనవరిలో జరిగిన యువరచయితల సమావేశంలో లియొనొవ్ యిలా అన్నారు: "భావిదృష్టితో మన యావత్తు సారస్వతాన్ని మనం వీక్షిస్తాము....సకల దేశాల భాషలలోనికీ మన రచనలను అనువదించక పోవడం సిగ్గుచేటని భావింపబడేటట్లుగా, దోస్తొవస్కీ గురించి, టాల్‌స్టాయి గురించి తెలుసుకోకపోవడం సిగ్గుచేటయినట్టుగా మన రచనలను చదవక పోవడం సిగ్గుచేటని భావింపబడేటట్లుగా—మన సారస్వతాన్ని అటువంటి ఉన్నత స్థాయికి తీసుకపోవడానికి, మనం యావచ్ఛక్తినీ ఉపయోగించి కృషి చేయాలి. మన రచనలు అనువదింపబడవలసిన అవసరం మన జీవితాన్ని కేవలమూ పరిచయం చేసుకొనడానికి మాత్రమేకాదు—సోవియట్ ప్రజలు ఎందుకు జీవిస్తున్నారు, వారి ఆశయాలేమిటి అన్నది తెలుసుకోవడానికి మాత్రమేకాదు—, వాటిలో సర్వోత్కృష్టమైన నిలువలు లేకపోయినప్పటికీ, అత్యంతంగా అభివృద్ధి చెందిన భావాలుగల ప్రజలు ప్రపంచంలో నేడు సాధించిన ఆత్మిక జీవితంలో కనీసం అతి ముఖ్యమైన పోషక పదార్థాలు వున్నవి కావడంవల్ల."

*తన కథల సంపుటం "సోవియట్ సారస్వతం" అన్న దానికోసం యీ అరగాన్ ఎంచిన సోవియట్ రచయితల కథలు కొన్నిటిని "సోవియట్ భూమి" సంపాదకులు ప్రచురించదలుచుకున్నారు. మా పత్రిక వచ్చే సంచికలో కాన్‌స్టంటిన్ పాస్తొవస్కి కథ "ది నైట్ కోచ్" అన్న దానిని చదవండి.*

---

# తాతారియా కళలు

(21 వ పుట తరువాయి)

పడేటంత బాగా వుంది.

ఉత్సవం కొరకు సన్నాహాలు మొదలయ్యాక. "స్లిప్పర్స్" అనే జె. పద్జి రచించిన సరదాయైన సంగీత రూపకాన్ని ప్రదర్శించేందుకు ఔత్సాహికులంతా ఏకమయ్యారు. తతార్ ప్రజలు చాలా సంగీత ప్రియులు కావడం మూలానా, అందుచేత సంగీత గాన నృత్యాలతో చతుర సంభాషణలుగల నాటక ప్రదర్శనలంటే వారికి ప్రత్యేకమైన సరదా వుండడం వల్ల, వృత్తి నాటక సమాజాలలోనూ, ఔత్సాహిక బృందాలలోనూ తతారియాలో సంగీత రూపకాలకు ప్రత్యేకమైన అదరణ వుంది.

## 700కు పైగా చిత్రాలు

మాస్కో పౌరులను ఆకర్షించినది రంగస్థల ప్రదర్శనలు ఒకటేకాదు. తాతార్ గ్రంథకర్తల గ్రంథాలపైని వారు తీవ్ర వాదోపవాదాలలో పాల్గొన్నారు. ఈ చర్చలు గ్రంథాలయాల్లోనూ, సంస్కృతీ గృహాలలోనూ జరిగాయి. తతార్ కళాప్రదర్శనలలో వారు చాలా ఆసక్తిని కనబరిచారు.

తతార్‌ల లలిత కళలకు సాంప్రదాయాలు లేవు. విప్లవానికి ముందర నవి లేనేలేవు—చిత్రలేఖనంగాని, శిల్పంగాని, గ్రాఫిక్ కళలుగాని. ప్రజల కళాభిరుచి అలంకృత అనువర్తిత కళలో వ్యక్తపడింది. పుష్కలమైన అలంకారాలు యిళ్ళకూ, దుస్తులకూ, గృహోపకరణాలకూ శోభను చేకూర్చేవి. మొఖమల్ మీద—ముఖ్యంగా తలపాగాల్లో—బంగారు, వెండి బుటేదారీపని, పాత్రలు, చర్మపుజోళ్ళ మీది అందమైన అలంకారాలూ చాలా ప్రసిద్ధమైనవి. ఈనాడు కూడా తతారియాలో అనువర్తితకళ ప్రజాభిమానాన్ని చూరగొంటూనే వుంది. కాని దానితోబాటు లలిత కళలుకూడా పెంపొందుతున్నాయి. తతార్ చిత్రకారులు చిత్రించినవి ఏడు వందలకు పైగా చిత్రాలు, యీ ఉత్సవ సమయంలో మాస్కోలో ప్రదర్శింపబడ్డాయి.

తతార్ కళా సారస్వత దశ దినోత్సవం తతార్ ప్రజలకు, సోవియట్ దేశపు బహుజాతుల సంస్కృతికీ ఒకగొప్ప మహోత్సవం.

---

# పాఠకుల ప్రశ్నలకు మా జవాబులు

(30వ పుట తరువాయి)

## ప్రశ్న: సోవియట్ దేశంలో అద్దెలు ఏ విధంగా వుంటాయి?

*పశ్చిమ బెంగాలు మినిస్టీరియల్ ఆఫీసర్సు సంఘ కార్యదర్శి (మిడ్నాపూరు) మొదలైనవారు.*

జవాబు: ప్రభుత్వానికి చెందిన యింటి వాటాను అద్దెకు పుచ్చుకున్నవారు (నగరాలలోని యిళ్లలో అధికభాగం ప్రభుత్వానివే) నివాసంచేసే భాగాలో చదరపు మీటరు ఒక్కింటికి 1 రూబులు 32 కోపెక్కులు అద్దెగా చెల్లిస్తారు (వంటిల్లు, వసారాలూ మొదలైనవి యిందులో చేరవు). పించనీపుచ్చుకున్నవారికీ, అశక్తులకూ, నగటుకు తక్కువగా జీతాలు వున్న కార్మికులకూ నూటికి 33 నుండి 50 వంతులు అద్దె తగ్గింపబడుతుంది. సాధారణంగా అద్దెకూ, ఇంటి మరమ్మత్తులు వగైరాకూ కార్మికుని జీతంలో నూటికి 4 నుండి 5 వంతులు వరకూ అవుతుంది.

## ప్రశ్న: రూపాయి, రూబులు మారకం రేటు ఎంత?

*శ్రీ కె. జగన్నాథరావు, కారెంపూడి.*

జవాబు: 1957 జనవరి 1 వ తేదీని నూరు భారత దేశపు రూపాయలు 84.30 రూబుళ్ళకు మార్చబడ్డాయి.

# సోవియట్ దేశంలో సంస్కృత విద్యాభ్యాసానికి ప్రప్రథమ పాఠ్యగ్రంథం


ప్రొఫెసర్ పి. కుజనెత్సోవ్


*సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ప్రచురణాలయం, మాస్కో విశ్వవిద్యాలయంలో డోసెంట్ ఆఫ్ ఆర్ట్స్ అయిన వీరా అలెగ్జాంద్రోవ్నా కొచర్గినా రచించిన సంస్కృత పాఠ్య పుస్తకం (మాన్యువల్) ప్రథమ భాగాన్ని ప్రచురించింది. సోవియట్ దేశములో సంస్కృత విద్యాభ్యాసాని కిది తొలి పాఠ్య గ్రంథం.*

*వి. ఏ. కొచర్గినా నూతన గ్రంథాన్ని పరిష్కృతం చేసిన ఆచార్య పైతొర్ కుజ్నెత్సోవ్ వ్యాసాన్నొక దానిని మేము ప్రచురిస్తున్నాము.*

కొద్ది సంవత్సరాలు క్రితం మాత్రమే అకెడెమీషియన్ యఫ్. ఐ. ష్చేర్బత్‌స్కీ, నేను సాధారణంగా లభ్యంకాని జర్మన్ భాషలోని బుహ్లెర్ సంస్కృత పాఠ్యగ్రంథ రష్యన్ అనువాదాన్ని ప్రచురించారు.

వి ఏ. కొచర్గినా రచించిన పాఠ్యగ్రంథం వంటిది వెంటనే జరగ వలసిన పని. వేలాది సంవత్సరాలుగా ఎన్నో సారస్వత, వైజ్ఞానిక, తాత్త్విక మహా గ్రంథాలు లిఖింపబడిన ప్రాచీన భారతీయభాష అయిన సంస్కృత భాషా పరిజ్ఞానం లేకుండా, భారత దేశ చరిత్ర, సంస్కృతులలో ప్రాథమిక జ్ఞానాన్ని సైతం సంపాదించడం అసాధ్యం. సంస్కృత భాషా పరిజ్ఞానం భాషాశాస్త్రాన్ని, స్థూలంగా అధ్యయనం చేయడానికీ, వివిధ భాషలను సరిపోల్చి అధ్యయనం చేయడానికీ తప్పనిసరియైనది.

భారతీయ భాషలలో ప్రవీణులైనవారే కాకుండా, భారత దేశ చరిత్రనూ, ఆర్థిక, తత్త్వశాస్త్రాలనూ అధ్యయనం చేస్తోన్న యితర ప్రవీణులు కూడా—చరిత్రకారులు, ఆర్థికశాస్త్రజ్ఞులూ, తత్వశాస్త్రజ్ఞులూ—సంస్కృత భాషాభ్యాసం చేస్తున్నారు. మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్ విశ్వవిద్యాలయాల తత్త్వశాస్త్ర, చరిత్ర శాఖలలో చాలా ఏళ్లుగా సంస్కృతం బోధింపబడుతోంది. సంస్కృతాన్ని నేర్చుకోవడానికి యువకులైన విద్యార్థులలో వున్న అభిలాషను యీ దిగువ విషయాన్నిబట్టి తెలుసుకోవచ్చును. మాస్కో విశ్వవిద్యాలయంలో సంస్కృత భాషాభ్యాసం నిర్బంధం కాకపోయినప్పటికీ, ఎంతో మంది పట్టభద్రతకు కృషిసాగిస్తోన్న విద్యార్థులు భాషలలో తమ ప్రత్యేక హంశం సంస్కృతం కాక రష్యన్‌భాషో లేదా యితర స్లావ్ భాషలో, రోమనో-జర్మన్, లాటిన్, గ్రీకు భాషలో అయినా, ప్రతి సంవత్సరమూ ఐచ్ఛికంగా సంస్కృతాన్ని అభ్యసిస్తున్నారు. సంస్కృత భాషాభ్యసనానికి సోవియట్ సారస్వతంలోని యీ ముఖ్యావశ్యకాన్ని, వి. ఏ. కొచెర్గినా పాఠ్యగ్రంథం తీర్చివేస్తుంది.

వి. ఏ. కొచెర్గినా అనుభవజ్ఞురాలైన సంస్కృతోపాధ్యాయిని. అనేక సంవత్సరాలుగా తత్త్వశాస్త్ర, చరిత్రశాఖల విద్యార్థులకు ఆమె సంస్కృతం బోధిస్తోంది, (1956 నుండీ మాస్కో విశ్వవిద్యాలయ ప్రాచ్యభాషా సంస్థ విద్యార్థులకు ఆమె బోధిస్తోంది). తన పాఠ్యగ్రంథం రచనకు ఆమె తన జ్ఞానాన్ని సాధారణీకరించింది. రచనా పద్ధతి దృష్ట్యా యిది చక్కగా భావింపబడింది. తొలిభాగంలో యీ దిగువనిచ్చిన ప్రకరణాలున్నాయి: స్వరరూపశాస్త్రం, రచన, పదరూప శాస్త్రం, పదనిర్మాణం. దీనిలో సంస్కృత అక్షరాలు, పఠనసూత్రాలు, విశ్లేషను, పాఠాలలోని పదజాలం వున్నాయి. పాఠ్యవస్తువుకూ, విశ్లేషానికీ మహాకావ్యమూ, తాత్త్విక ఉద్గంథ్రమూ అయిన మహాభారతంలోని సావిత్రీ కథలోనుండి నాలుగు ప్రారంభ పద్యాలు, యీ పుస్తకంలో ఉపయోగించుకోబడ్డాయి. కొన్ని యూరోపియన్ సంస్కృత వాచకాలలోవలె కాకుండా యీ పాఠ్య గ్రంథంలో మొదటినుండీ, లాటిన్ లిపి కాకుండా సంస్కృత లిపి వాడుక చేయబడింది. దేవనాగరిని తెలుసుకోవడం, అధునాతన భారతదేశంలోని యితర భాషలను, ప్రధానంగా హిందీభాషను అర్థం చేసుకోవడానికి విద్యార్థులకు సాయపడుతోంది. స్వరశాస్త్రం గురించి వున్న ప్రకరణం, యితర యూరోపియన్ పాఠ్య గ్రంథాలలోకంటె హేతుబద్ధంగానూ, క్రమబద్ధంగానూ ప్రాచీన భారతీయ వ్యాకరణశబ్దాల విభాగాన్ని చూపుతుంది.

వి. ఏ. కొచర్గినా ప్రస్తుతం యీ పుస్తకం రెండోభాగాన్ని వ్రాస్తున్నది. దీనిలో వాక్య నిర్మాణం, పద నిర్మాణం గురించి ప్రకరణాలుంటాయి.

## ఔత్సాహికులైన తోటమాలులు

(13వ పుట తరువాయి)

దక్షిణాది మొక్క అయిన ద్రాక్ష గురించి మేము పేర్కొన్నాము. కాని యిది బొబిలెవ్ స్థలంలో పెరిగింది. ఈ ఔత్సాహికులైన తోటమాలులు, గొప్ప రష్యా ఉద్యాన కృషికుడైన ఐ. వి. మిచూరిన్ పద్ధతులను అమలు జరిపి, మాస్కో మండలంలోని తీవ్ర వాతావరణ పరిస్థితులలో ద్రాక్ష పళ్ళను పండించడం మొదలు పెట్టారు.

కాని బొబిలెవ్ భార్య మారియా, ఎక్కువ ఆచరణ దృష్ట్యా పనులు చేస్తుంది. ఆమె చలి కాలానికి అన్ని రకాల జాములను నిలవ చేస్తుంది—చెర్రీ, నల్ల కుర్రంట్, స్ట్రాబెర్రీ, రాస్ప్బెర్రీ జాములు మొదలైనవి. మారియా తేనెటీగలను కూడా పెంచుతోంది. పూల పరాగీకరణను చేస్తూ తేనెటీగలు పంటను పెంచుతాయి గాబట్టి. ఆమె భర్త యిందుకు చాలా సంతోషించాడు (12వ పుటలోని చిత్రం చూడండి).

ఈ మదుపుగల ప్రతి ఒక్కరికీ వేరు వేరు అభిరుచులున్నాయి.

ఇటువంటి పళ్ళతోటను మాస్కోలోనే కాకుండా సోవియట్ దేశంలోని యితర నగరాలలో కూడా కనిపిస్తున్నాయి, వాటి సంఖ్య రానురాను పెరుగుతోంది.

---

## మనిషికి పని ముఖ్యావశ్యకం

(28వ పుట తరువాయి)

విధంగా ఉపయోగపడదల్చుకున్నారు. అంచేత యీ పెన్షనర్లు వృద్ధ కార్మికుల సంఘాన్ని ఏర్పరిచారు. అందర్లోనూ వృద్ధ కార్మికుడైన నికొలాయ్ మిఖెయేవ్ అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డారు. పరిశ్రమ ఆహార శాలలనూ, బాలోద్యానవనాలనూ, శిశుపోషణాలయాలనూ, కార్మికులకు లభించే సాంస్కృతిక సౌకర్యాలనూ, వారి జీవిత పరిస్థితులనూ తనిఖీ చేయడానికి వారు నిర్ణయించుకున్నారు.

వడ్రంగి మిహాయిల్ అలెక్సియేవ్, డ్రిల్లర్ నికొలాయ్ బ్రియ్‌కోవ్, పరికరాలను తయారు చేసే ఎగొర్ సుకలిన్ పరిశ్రమ పాఠశాలకు తోడ్పడతామన్నారు.

పింఛనీదారుడు నికోలాయ్ పిస్లెతిన్ పరిశ్రమ క్లబ్బు పరిపాలనా సంఘ సభ్యునిగా ఎన్నుకోబడ్డారు.

పూర్వపు బుక్‌కీపర్ అన్నా హొయెగ్లి యించుమించు ప్రతి రోజూ పరిశ్రమలో కనిపిస్తుంది. ఆమె తన తరవాత పనిలోనికి వచ్చినామెకు సాయపడుతోంది.

ద్మిత్రి కజకోవ్, మిహాయిల్ మిఖెయెవ్ శ్రమిక భద్రతను గురించి సంఘానికి సభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

నికొలాయ్ మిఖెయేవ్ తన పనులను యిప్పుడు కనుగొన్నారు తన రెండవ జీవితాన్ని పరిశ్రమలో ప్రారంభించారు. ఆయనకు చిన్నతనం వస్తున్నట్టుగా కనిపిస్తోంది, తను మరి పనిచెయ్యని రోజులు వస్తాయని ఆయనకు యిక భయంలేదు. ఎంతో పనివుంది, ఆసక్తికరమైనది, ముఖ్యమైనదీ.

ఇంట్లో నికొలాయ్ మిఖెయేవ్ తన పూర్వపు కార్యక్రమాన్ని మళ్ళీ మొదలు పెట్టారు. సాయంత్రం తన గడియారానికి అలారం పెడతారు. ఉదయం పెందరాడే లేస్తారు, పత్రికలు చదువుతారు, బడినుండి వచ్చాక తన మనుమరాలితో కాలక్షేపం చేస్తారు, తరవాత మధ్యాహ్నం పరిశ్రమకు వెళ్తారు. ఆయన ఎప్పుడూ ఒకే సమయంలో చేరతారు. ద్వారంవద్ద పనిలోవున్నతను యీయనను పలకరించి గౌరవంగా—"మిఖెయేవ్ వచ్చారు. అంటే ఊళ తొందర్లొనే వేస్తారన్నమాట, షిఫ్టులు మారా"యని అని అంటాడు .

---

### ఇంగ్లీష్, ఉర్దూ, బెంగాలీ భాషలలో

# మాస్కో రేడియో ప్రసార కార్యక్రమాలు

**ఇంగ్లీషులో**

| | |
|---|---|
| 14.00—14.15 | భారతీయ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |
| 16.30—17.15 | భారతీయ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |
| 20.15—20.45 | భారతీయ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |

**హిందీలో**

| | |
|---|---|
| 14.15—14.30 | భారతీయ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |
| 18.30—18.45 | భారతీయ కాలమానం 16–19 మీ. బ్యాం. |
| 21.15—22.00 | భారతీయ కాలమానం 13–16–19 మీ. బ్యా. |

**ఉర్దూలో**

| | |
|---|---|
| 14.45—15.00 | భారతీయ కాలమానం |
| 14.15—14.30 | పశ్చిమ పాకిస్తాన్ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |
| 19.30—20.15 | భారతీయ కాలమానం |
| 19.00—19.45 | పశ్చిమ పాకిస్తాన్ కాలమానం 13–16–19 మీ బ్యాం. |

**బెంగాలీలో**

| | |
|---|---|
| 14.30—14.45 | భారతీయ కాలమానం |
| 15.00—15.15 | తూర్పు పాకిస్తాన్ కాలమానం 13–16–19–25 మీ. బ్యాం. |
| 18.45—19.30 | భారతీయ కాలమానం |
| 19.15—20.00 | తూర్పు పాకిస్తాన్ కాలమానం 16–19 మీ. బ్యాం. |
| 21.00—21.15 | భారతీయ కాలమానం |
| 21.30—21.45 | తూర్పు పాకిస్తాన్ కాలమానం 13–16–19 మీ. బ్యాం. |

శ్రోతల వ్యాఖ్యలు, సలహాలు సంగీత కార్యక్రమాలకు సంబంధించిన అభ్యర్థనలు—రేడియో కేంద్రం, మాస్కో, యు ఎస్ ఎస్ ఆర్ కు గానీ; సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ, 25 బారాఖంబా రోడ్డు, పోస్టుబాక్సు నెంబరు 241, న్యూ ఢిల్లీకిగాని పంపవలెను.

# సోవియట్ రచయితల గ్రంథాల్లో భారత దేశం

## ప్రశ్న: చాలామంది ఇంగ్లీషు గ్రంథకర్తలు చేసినట్టుగా రష్యన్ గ్రంథకర్త భారతీయ వాతావరణంతో, భారతీయ పాత్రలతో నవలనేదైనా వ్రాశారా? (శ్రీ బిపుల్ గంగూలీ కలకత్తా-25)

జవాబు: సోవియట్ రచయితలు వ్రాసిన చాలా రచనలు భారత దేశ జీవితానికీ, ప్రజలకూ సంబంధించినవి వున్నాయి.

### "ప్రమాదకరమైన తిరుగుబాటు"

పజాదరణను పొందిన ఎమ్మా వ్యగొద్‌స్కయా రచన "ప్రమాదకరమైన తిరుగుబాటు" అన్నది అనేక ముద్రణలలో ప్రచురింపబడింది. ఇది 1857-59లో బ్రిటిష్ వలస ప్రభువులకు వ్యతిరేకంగా భారతీయ ప్రజల యుద్ధాన్ని వివరిస్తుంది. విదేశీయులకు వ్యతిరేకంగా 1857-59లో జరిగిన జాతీయ తిరుగుబాటులోని ఒక అత్యంత ప్రముఖ ఘట్టం—ఢిల్లీ వీరోచిత రక్షణ యీ కథలో ప్రముఖంగా వుంది.

ఈ గ్రంథం యొక్క బలం, వలస రాజ్యాధిపతులు భారత దేశంపైని ఎలా పెత్తనం చేశారో, భారతీయులను వారు ఎలా కొల్లగొట్టి, అణచివేశారో జాలి కలిగేటట్టుగా వివరించడంలో వుంది. ఈ రచయిత్రి సిపాయీల తిరుగుబాటును, తమ దేశంపైని బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా ప్రజల అసమ్మతి ప్రకటనగా చిత్రించారు.

తమ ప్రజల సౌఖ్యంకోసం పోరాడిన వారిని—సిపాయిల నాయకుడు పాండేనూ, ఆయన కుమార్తెనూ, అతని సహచరుడు చంద్రసింగునూ—కళ్లకు కట్టినట్టుగా ఇ. వ్యగొద్ స్కయా చిత్రించారు. భారతీయ ప్రజలు 19వ శతాబ్దం మధ్యలో ఓడిపోయినప్పటికీ, తొమ్మిది దశాబ్దాల తరవాత యీ ప్రాచీన భూమికి వచ్చిన స్వాతంత్ర్యోద్యమానికి యీ సిపాయిల తిరుగుబాటు నాంది అయ్యిందని ఆమె తెలియజేస్తుంది.

### అఫనసీ నికితిన్

చాలా ఆదరణను పొందిన భారత దేశానికి సంబంధించిన యింకో పుస్తకం కె. కునిన్ రచించిన చారిత్రిక రచన "మూడు సముద్రాల కావల. త్వెర్ వర్తకుడు అఫనసీ నికితిన్ యాత్రలు" అన్నది. 15వ శతాబ్దంలో రష్యన్ వర్తకుడు అఫనసీ నికితిన్ పెర్షియాలోనూ, భారత దేశంలోనూ జరిపిన యాత్రల కథ. యూరప్ నుండి భారత దేశానికి సముద్ర మార్గం కనుగొనబడడానికి ముప్పయ్యేళ్ళకు ముందర నికితిన్ భారత దేశాన్ని సందర్శించారు. అనేక ఏళ్ల ప్రయాణం చేశాక నికితిన్ తిరిగి యింటికి బయలు దేరారు, కాని త్రోవలో చనిపోయారు. "మూడు సముద్రాల కావల"అన్న ఆయన నోట్స్ మనకు లభించాయి. ఈ వీర రష్యన్ యాత్రికుని, ఆయన వెంబడిని వెళ్ళిన ధైర్యశాలియైన 14 యేళ్ల బాలుడు యూషా యొక్క సాహస కృత్యాలను చిత్రించే రచనకు యీ నోట్సునూ కునిన్ ఉపయోగించుకున్నారు. ఈ పుస్తకంలో భారత దేశపు జీవితమూ, ఆచార వ్యవహారాలూ, సాంప్రదాయాలూ చక్కగా వర్ణించబడ్డాయి.

1947లో తన గ్రంథం "సుదూర తీరాలకు" అన్నదానిలో యం. మూరతోవ్ రచన "అఫనసి నికితిన్ యాత్రలు" ప్రచురింపబడింది. "పురాతన రష్యన్ యాత్రాకథలు" అన్నది కూడా దీనిని గురించే.

### "భారతీయ స్వాప్నికుడు"

ఇ. స్పెన్‌బర్గ్ చారిత్రక నవల "భారతీయ స్వాప్నికుడు" అన్నది 1956 లో పుస్తక విక్రయశాలలకు వచ్చింది. ఈ నవల గిరాసిం లెబెదెవ్‌ను చిత్రిస్తుంది. ఈయన భారతదేశంగురించి ప్రథమ రష్యన్ పండితుడు, బెంగాలీ భాషలో నాటకాలను ప్రదర్శించేందుకు భారత దేశంలో మొదటి యూరోపియన్ నాటకశాలను స్థాపించారీయన. భారతదేశంలో లెబెదెవ్ గడిపిన 12 సంవత్సరాల గురించి, అన్ని కష్టాలను గట్టెక్కి ఆయన విజయం పొందడం గురించి యిది వుంది. సోవియట్ పాఠకులకు ఆసక్తిని కలిగించే భోగట్టా, 18 వ శతాబ్దంలో భారత దేశపు జీవితం గురించి, సంస్కృతి గురించి ఎంతో భోగట్టా యీ పుస్తకంలో వుంది.

### "కాశ్మీర్ గేయాలు"

ఉజ్బెక్ రచయిత షరాఫ్ రషిదోవ్—యీయన రెండుసార్లు భారతదేశాన్ని దర్శించారు—"కాశ్మీర్ గేయాలు" అన్న కథను వ్రాయడం ముగించారు. సౌఖ్య సంపదల 'కోసమూ' స్నేహం కోసమూ, ప్రేమకోసమూ, విశ్వాసంకోసమూ పోరాడేవారి పరాక్రమాన్ని కీర్తించే గాధలకు భారతదేశం వాసికెక్కింది. వాటిలో ఒకటి, అనేక శతాబ్దాల క్రితం కాశ్మీర్‌లో పుట్టిన తేనెటీగ, నదీ దేవతగురించి కథ యింకా ప్రజలలో వ్యాపించి వుంది. రషిదోవ్ తన కథను యీ గాధ ననుసరించి వ్రాశారు.

### భారత దేశం గురించి పద్యకావ్యాలు

గద్య రచయితలేకాక మా కవులుకూడా భారతదేశపు వాతావరణంతో రచనలు చేశారు. ప్రఖ్యాత సోవియట్ కవి నికొలాయ్ తిఖనోవ్ 1920 లో, తన యజమానిచే మానవునిగా పరిగణింపబడని భారతీయ బాలుని గురించి "సామి" అన్న పద్య కావ్యాన్ని వ్రాశారు. ఉజ్బెక్ రచయిత అయ్‌బెక్ ఇంకోపద్య కావ్యం వ్రాశారు. దానిపేరు "జఫార్, జొహ్రా". తమ దేశంలో బ్రిటిష్ పాలన సాగినప్పుడు భారతీయ బాలల దుర్గతిని తెలియజేస్తూ యిది, యీ దిగవనిచ్చిన మహత్తర వాక్కులతో సమాప్త మవుతుంది:

"దరిద్ర గ్రామాల పిల్లల్లారా!
లాహోర్ నగర బాలల్లారా!
మళ్ళీ, త్వరలో మీరు
పొందుతారు స్వాతంత్ర్యం, సౌఖ్యం!"

భారతదేశం గురించి తజిక్ కవి మీర్జో తుర్సున్-జాదే చాలా గీతాలను రచించారు. ఈయనకూడా భారత దేశానికి వెళ్ళారు. యస్. స్మిర్నోవ్, ఎ. సఫ్రనోవ్, మిరాష్కర్, యింకా చాలామంది కవులూ భారతదేశం గురించి పద్యాలు వ్రాస్తున్నారు.

మహత్తర ప్రాచీన దేశమైన భారతదేశ జీవితంలోనూ, దాని వివేకవంతులైన ప్రజల భవిష్యత్తులోనూ సోవియట్ రచయితలూ, కవులూ ఎంతో ఆసక్తిని చూపుతున్నారు.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు పంజాబీ ప్రెస్, సదర్ బజార్, న్యూ ఢిల్లీ

